# JAYASENA VIJAYAM.



# జయసేన విజయము

(ఐదంకముల నాటకము)






గ్రంథకర్త:
వేదాంతం సీతారామాంజనేయాచార్యులు.



1938.

 వెల 0-12-0

Janakiram Press, Tenali.

# మనవి.

---

జయసేనవిజయమను యీనాటకము కేవల[illegible] నామిత్రుఁడగు నారాయణం దశరథ రామాచార్యుల ప్రోత్సాహముచే నేదీనిని రచించితిని. నేను గుంటూరు టౌన్ హైస్కూలునం దాంగ్లభాష నభ్యసించుసమయమున నాపాఠశాలయం దాంధ్రోపాధ్యాయులుగా నుండి నాకాంధ్రమును బోధించిన శ్రీ శిష్టా హనుమచ్ఛాస్త్రి గారినే గురువరునిగా నటీసూత్రధారుల సంభాషణమున నుదహరించితిని. నేనొనర్చిన యీ సాహసమునకు శాస్త్రులవారు నన్ను మన్నింతురుగాక!

కవితావైఖరిననుసరించి యిదియే నాప్రథమప్రయత్నమని గ్రహింపఁగల రసజ్ఞులీగ్రంథము నందలి దోషములను మన్నించి యందలి సుగుణములనే గైకొందురుగాక! పండితులగువారిందలి లోపములను నాకెఱిఁగించినచో వానినెల్ల ద్వితీయముద్రణమున సవరించుకొందును.

తెనాలి.
22—3—38

ఇట్లు,
గ్రంథకర్త.

## ఈ నాటకమునందు పాత్రలు

పురుషులు :-

జయసేనుడు— కథానాయకుడు

మతిమంతుడు— మంత్రికుమారుడు; జయసేనుని మిత్రుడు

చంద్రసేనుడు— జయసేనుని తండ్రి

చండవర్మ— చంద్రసేనుని తమ్ముడు

ధర్మపాలుడు— మణిప్రస్థపురాధీశ్వరుడు

సుమతి } ధర్మపాలుని మంత్రులు
కుమతి }

రాఘవవర్మ— సింహపురాధీశుడు

కేశవశాస్త్రి— రాఘవవర్మ పురోహితుడు

స్త్రీలు :

ప్రభావతి— ధర్మపాలుని పుత్రిక

హేమలత— ప్రభావతి తల్లి

మల్లిక— ప్రభావతి చెలికత్తె

భటులు తదితరులు వచ్చుచుందురు.

---

మరా:— ఈ నాటకమును నాయనుమతిలేనిదే యెవ్వరును ప్రదర్శింపఁగూడదు.



శ్రీమద్వైఖానసమహా గురవే నమః

# జయసేన విజయము



## నాంది

శా॥ శ్రీ రామామణి పాదసేవ సంపదన్ శీతాంశువంశుల్లుండు బల్
గారామొప్పంగ నాకపతి వెలయన్ నాకేశ నాకేశుడున్
నీకేంద్రోద్భవ నైనతేను ఘన మానిశ్రేణి సేవింపఁగా
వారాశిన్ శయనించు శ్రీసుడిడు సభ్యశ్రేణికిన్ సంపదల్॥

(నాంద్యంతమున సూత్రధారుండు ప్రవేశించి తెఱవాకం దిరిగి)
నటీ! నటీ!

నటి- (ప్రవేశించి) నాథా! యేల నన్నింత త్వరగాఁ బిలచితిరి?

సూత్ర- ఇంకను త్వరగాఁ బిలచితిననుచుంటివా? సింగారమొనరించుకొనుచుఁ గర్తవ్యమునే మఱచితివా? ఈనాడు మనల నేదేని నూతననాటకముఁ బ్రదర్శింపుఁడని కోరిన యీ సభికులఁ గాంచితివా?

మ॥ అరివీరుల్ భయమంద భూప్రజలమందానందమున్ జెందను
ర్వరఁ బాలింపుమటంచుఁ దండ్రి వచియింపన్ భూపనీయాజ్ఞనే
నురుభక్తిం దలఁదాల్తునంచు జయసేనుం డెవ్విధిన్ భక్తిఁ గ
న్పరుపంగల్గెనో యట్లు సభ్యులమెదన్ వర్తింపు మబ్జాననా॥

**నటి-** ఓహో! నూతననాటకము జయసేనవిజయముఁ బ్రదర్శింపవలయు ననుట కిది సూచన కాఁబోలు. ప్రదర్శించుట కేమిగాని యీ నాటకమును రచించిన కవి యెవరో తెలియఁజేతురా?

సూత్ర- శ్లో॥ విష్ణుపదపద్మచింతనామృతపాన
మత్తులై దనరారు మాన్యులైన
వైఖానసులలోన వరలుఁ గాశ్యపసగో
త్రాబ్ధిచంద్రులను సద్ధర్మరతులను
కృష్ణమాచార్యవర్య కీర్తిధనుఁ బెన్మ
హామహులకుఁ బిచ్చమాంబకును దాను
శ్రీ నృశింహాచార్య సీతరామాచార్య
శ్రీనివాసాచార్యులైన సుతులు

తే॥ గీ॥ జననమందిరి వారిలో ననఘుఁడైన
యీ నృశింహుని ప్రియపుత్రుఁ డాంజనేయ
నామధేయుఁడు దీనిఁ బ్రేమ మీఱ
వ్రాసెఁ దప్పులున్న క్షమింపవలె సుకవులు॥

నటి- ఈ కవి యెవరి శిష్యుఁడు?

సూత్ర- తే॥ గీ॥ సరస శిష్యాన్వయాంబోధిఁ జంద్రుఁడనఁగఁ
వెలఁగు శ్రీహనుమచ్ఛాస్త్రి శిష్యుఁ డితఁడు
ఆ మహామహు పదయుగ మాత్మఁదలచి
వ్రాసె నీ నాటకంబును భాసురాంగి॥

(ఆకసమువంకజూచి) చాల ప్రొద్దుపోయినట్లున్నది. నీ గానకళానిపుణత్వముఁ గనుంగొనుచును జాగొనరింపకఁ బోయి పాత్రల సిద్ధపఱుపుము (తెరలో)

దౌవారికా! మతిమంతునిఁ బిలువనేఁగిన భటుఁ డరుదెంచెనా?

సూత్ర- (వినుట నభినయించి) ప్రేయసీ! కుమారరాజాగారగు జయసేనుఁ డిటు వచ్చుచున్నట్లున్నాడు. మనముఁ బోవుదము రమ్ము
(ఇరువురు నిష్క్రమింతురు)

---



# జయసేనవిజయము



## ప్రథమాంకము



ప్రథమరంగము: జయసేనుని సౌధము

(ప్రవేశము జయసేనుఁడు)

జయ- నేఁడు నా తండ్రి నా కెఱింగించిన విషయమును నా మిత్రుఁడగు మతిమంతున కెఱింగించుటకై నా హృదయము చాలయు వేగిరపడుచున్నది. (ఎదుటఁజూచి) నా మిత్రుఁడగు మతిమంతుఁ డిటు వచ్చుచున్నాడు.

మతిమంతుఁడు- (ప్రవేశించి) మిత్రమా! సత్వరముగా రమ్మని కబురంపితివేల?

జయ- ఒక విశేషము నెఱింగించుటకు.

మతి- విశేషమా! అది యెట్టిదో సాధ్యమైనంత త్వరలో వెలిఁబుచ్చి నా హృదయాందోళనముఁ దప్పింపుము.

జయ- నేటి యుదయంబున నా జనకుఁడు ప్రేమతో నన్ను దగ్గఱఁ జేర్చుకొని సామవచనంబుల నిట్లుఁ బలికె. "కుమారా! ప్రాయ మబ్బినదాది రాజ్యభారమును భుజపీఠికను మోపితిని. కాని యీనాటికి దానిఁ బూన నశక్యమగు వార్ధక్యంబు లభించెఁగాన"

మతి- (మాటకడ్డువచ్చి) నీకు రాజ్యాభిషేక మొనర్తునని వచించెనా?
జయ- అగును.

మతి- నీ వందుల కంగీకరించితివా ?

జయ- జనకునిమాట కెదురాడఁజాలక పూనఁజాలని భారము నైనఁ బూన సమ్మతి సూచించితిని.

మతి- సెబాస్ నా కాంతరంగికమిత్రుఁడవైనందులకు నా మనసునకు నచ్చిన పని యొనర్చితివి. (తనలో) ఈతని జాతకగ్రంథము నా యొద్దనే యున్నది. ఈతనికై సేయఁబడు రాజ్యాభిషేక ప్రయత్నము విఫలమైపోవునని యా జాతకమున జెప్పఁబడియున్నది. ఇంత దనుక నట్టి చిహ్నంబు లేమియుఁ గానవచ్చుట లేదే? (యోజించి) జాతకములందలి విషయంబు లొకొక్కపరి యసత్యంబులై చనుచుండుఁ గదా! కానిమ్మెట్లయిన నీతనిఁ బ్రోత్సాహపఱచుటదక్క యిప్పు డా విషయమును నే బయల్పఱుపరాదు.

జయ- మిత్రమా! ఏదియో దీర్ఘాలోచన మొనర్చుచున్నావే?

మతి- ఏమియును లేదు. నీవు సింహాసనాసీనుఁడవైన యుత్తరక్షణము నుండియు, నీ భవిష్యదభివృద్ధికి యోర్వఁజాలని కపటాత్ముఁడగు నీ పినతండ్రిని బ్రక్కలోని బల్లెమురీతిఁ గాంచుచుందుము. ఆతఁ డెంతటి వాఁడనుకొంటివి?

ఉ॥ సత్యవచస్కులే యతని శాత్రవవర్గము సాధుబాధయే
నిత్యతపః ప్రభావము సనిత్యమనోభవక్షుద్రవాంఛలే
భృత్యులు సేవకావళియు భీకరమోహకరక్రియావళుల్
హత్యలె వందిమాగధులు సౌనటు లొప్పును చాడవర్మయుర్॥

జయ- (ఎదుటఁజూచి) మిత్రమా! మతిమంతా! మనకుఁ జెలికాఁడగు విష్ణుశర్మ యేలకో దీనాననుఁడై యిటే వచ్చుచున్నాడు.

(విష్ణుశర్మ ప్రవేశించి కన్నీరుఁ గార్చును)

జయ- వయస్యా దుఃఖించెద వేల?

విష్ణు- (గద్గదస్వరముతో) మిత్రమా! జయసేనా! నీ తండ్రిగారగు చంద్రసేన భూపాలుం డెచ్చటం గన్పించుట లేదట. వారనుదినంబును నిదురించు గదియం దొకమూల సొరంగ మొకడు త్రవ్వంబడి యున్నదట. పరిశీలించి చూడనా సొరంగము పురబహిఃప్రదేశము వఱకు నున్నదట. అందు నలుగురైదుగురి యడుగుల జాడలు సైత మగపడుచున్నవట. పురజను లెల్లరునూ, నెత్తురుజాడలగపడ కుండుటచే చండవర్మయే రాజ్యపాలన కాసించి భటుల సాయమున నియమించుచున్న నీ తండ్రి నందేనిం జేర్పించి, రహస్యముగాం జంపించి యుండునని తలంచుచున్నారు.

జయ- (విచారముతో) హా జనకా! (మూర్ఛిల్లును)

మతి- (విష్ణుశర్మతో) మిత్రమా! ఎంతటి ఘోరకృత్యము జరిగెను. తండ్రి మందాసలియం డనయుండు లోకానుభవముం జాలనికుఱ్ఱఁడునై యుండుటచే నా దుష్టుండిక చెలరేగును.

విష్ణు- మతిమంతా! చంపందలంచినవాఁడచటనే చంపక యొచటికో గొంపోయి చంపుట యందాతని యభిప్రాయమేమైయుండును.

మతి- సద్ధర్మరతుండైన చంద్రసేనుని శవమునుంగాంచి ప్రజలెల్లంగ్రోధోద్దీపిత మానసులై, దేశమున గొప్పవిప్లవముం గల్పింతురేమోయను సందియముచే నాకలుషాత్ముండిట్లొనర్చి యుండును.

జయ- (మూర్ఛందేరి) హా! జనకా! పసితనమందే గతించినతల్లి యటుండ నీవును నేటికి నన్నుం బాసిపోయితివా? రాజ్యాభిషేక మొనర్తు నంటివే, నాకు వివాహ మొనర్పనెంచి నాచిత్రపటముల నానాదేశముల కనిపితివే, ఇంక నాకష్టసుఖంబుల గమనించువా రెవరు? నన్నాదరించు వారెవరు?

మతి- రాజపుత్రా! ఊరడిల్లుము. కష్టదశ ప్రాప్తించినప్పుడు ధైర్యమవలంబించుటయే ధీరపురుషలక్షణంబు, అంతియేంగాని యింతిపగిది స్వాంతంబున నింతవంతం జెందందగునే, (తెఱలో కలకలము తరువాత)

జయ- (ధైర్యమవలంబించి; విష్ణుశర్మతో) మిత్రమా! ఆకలకలం చేమియో కనుఁగొనిరమ్ము. (విష్ణుశర్మనిష్క్రమించును)

జయ- మిత్రమా! మతిమంతా!

తే. గీ. స్వరము గద్గద వడఁజొచ్చె స్వాంతమునను
భయముజనియించుచుండె పాపాత్ముఁడైన
చండవర్మచేఁ గలుగుకష్టంబులనుచు
భావమునఁ దోఁచుచుండెనో భవ్యచరిత!

మతి- (ఎదుటఁజూచి) మొగమునదిగులుఁదోప, నడుగులు తడఁబడ, వడివడిగ, విష్ణుశర్మయిటేవచ్చుచున్నాడు. (ప్రవేశమువిష్ణుశర్మ)

విష్ణు- రాకుమారా! మంత్రిపుత్రా! మీకిరువురకు యిందుండఁజనదు. త్వరితముగ నెందేనిఁబోవుడు. చండవర్మయే ఖడ్గహస్తుఁడై తనుపరివారముతో నిటేవచ్చుచున్నాడు.

జయ- కత్తిదూసి, కనులెఱ్ఱఁజేసి)

చ: జనకుని ధర్మవర్తనునిఁ జంపి యధేచ్ఛగరాజ్యపాలనం
బొనరుపనెంచి నేఁబ్రతికి యుండిన నన్నటికేని యుద్ధు వ
త్తునని తలంచి వచ్చెడిని దుర్మద చిత్తుఁడునన్ వధింపఁగా
జనకుని యాత్మశాంతికయి చంపిదురాత్మునిఁ గీర్తిఁగాంచెదన్॥

మతి- జయసేనా! శాంతింపుము. ఆదురాత్ముఁడు దండనకుఁదగినవాఁడే కాని యిపుడు మాత్రమునీ వాతనినెదిర్చి జయింపఁజాలవు. ముమ్మాటికిని జయింపఁజాలవు. ఇవి నామాటలుకావు. నీ జనన ముహూర్తమునననుసరించి దైవజ్ఞులచే వచింపఁబడినవాక్కులు.

జయ- జయింపఁ జాలవు కావున వేగ మీ యాతని శరణువేడుమందువా?

మతి- శరణువేడుటకాదు. జలంధరాది దానవవీరులదెంచి నాకలోకమును ముట్టడింప నెందేని డాగిననాకనాధునిపోల్కి, నీవును ప్రకృత మాదురాత్ముని దృష్టిపథంబునఁ బడక యెందేనిఁ బాఱిపోవుటయే కర్తవ్యము.

విష్ణు- మంత్రికుమారా! నీ వాక్యము లెంతయు బాగుగా నున్నవి. అవశ్యకము నీవు చెప్పినట్లు నేనైన నెప్పుడో చేసియుందునే. "బ్రతికి యుండినఁ దినవచ్చు బలుసుకూర" యన్నట్లు ప్రాణములఁ గాపాడు కొనినతరువాతఁగదా! మన పౌరుషములును, బలాబలములుఁ జూచు కోవలసినది.

జయ- (మతిమంతుని దిక్కు మొగంబై) ఆ దురాత్ముని మదీయ నిశిత కరవాలంబున కెఱఁ గావించి కాక ఘృధ్రానేకపక్షి నికరంబుల కుక్షి నింపుమనుటకు మారుగ పలాయనసూత్రంబుఁ బఠింపుమనియా నీవుఁ జెప్పునది.

ఉ॥ పౌరుషమే ప్రధానముగ ప్రాణములఁ దృణమట్ల నెంచుచున్
పోరున వైరి వీరగణమున్ బరిమార్చెడి రాట్కులంబునన్
పేరు వహించినట్టి పృథివీపతి కేనుతనూభవుండనై
క్రూరునికిన్ భయంపడఁగఁ గూడున యుద్ధమొనర్పఁగూడదే॥

అదియునుఁగాక; దుర్మదాంధుండును; యుక్తాయుక్త విచార శూన్యుండై; విచ్చలవిడిగ సంచరించు నాయిందుగీను నిప్పుడున దండింపక, సింహాసనాసీనుండై యధేచ్ఛగ రాజ్యపాలనంబొనర్చుచుండెఁ జూచిఁ గొనఁదలఁచుట క్షాత్త్రియూహ గాదే? అప్పట్టున నాతని నోడించుటకు మన శక్యమా? "గోటితో నునుమఁదగినది గొడ్డలితో దునుమునట్లుఁ జేయువచ్చునా?

మతి- రాజకుమారా! ఎప్పటి కియ్యది ప్రస్తుతమో యట్లొనర్పవలయుఁ గాదే!

తే॥ గీ॥ జూదమున రాజ్యమెల్ల దాయాదికోడి
కానకేగి నలుండు యిక్కట్లువడియు
దైవకృపచేత తన సంపదలను మఱలఁ
బడయఁగాలేదె మున్ను భూపాలపుత్ర॥

జయ- (శాంతమునటించుచు) మిత్రమా! నీ యభిప్రాయానుసారముఁ గనే యొనర్చెదను. రహస్యముఁగ నెందేనిఁ దలదాచుకొనవలసిన నాకీ మణిమయభూషణాంబరములేల? (తెఱవంకఁదిరిగి) సేవకా!

సేవకుఁడు- (ప్రవేశించి) దేవా! ఏమి సెలవు ?

జయ- నీవు వేగమేపోయి కాషాయవస్త్రముల నిటు తెమ్ము (సేవకుఁడు లోనికేగి కాషాయవస్త్రములతోఁ బ్రవేశించి) దేవా ! ఇదిగో కాషాయవస్త్రములు. (సేవకుఁడు నిష్క్రమించును).

జయ- ఆ వస్త్రములఁ గైకొని; లోనికేగి వానిని ధరించి ప్రవేశించును)

జయ- మిత్రులారా! నేనిదే పోవుచున్నాఁడ.

మతి- రాజకుమారా ! నీ తండ్రిఁగూర్చి పురంబున రహస్యంబుగఁ దెలిసికొని తదుపరి నీవెచ్చట నున్ననూ నిన్నుఁగలసికొనెద. నీవు మాత్రము నీ నిజవృత్తాంతం బెచ్చటను బయల్పఱుపక జాగ్రతగా మెలఁగుచుండుము. పొమ్ము. (జయసేనుఁడు నిష్క్రమించును).

మతి- (విష్ణుశర్మతో) మిత్రమా! నే నిప్పురంబుననే యోగివేసమున సంచరించుచుఁ జంద్రసేన భూపాలునిఁగూర్చి తెలిసికొనెద. నీవు నామిత్రుఁడు దుష్టదృష్టిపథంబునఁ బడక జాగ్రతగా మెలఁగుచుండుము. నేఁ బోవుచున్నాఁడ. (నిష్క్రమించును)

విష్ణు- (తెఱవంకఁ జెవియొగ్గి) జయజయధ్వానములు వినవచ్చుచున్నవి. చండవర్మ యిటే వచ్చుచున్నట్లున్నాఁడు. నేనా కలుషాత్మునికనులఁ బడి చేతులార ముప్పు దెచ్చుకొననేల ? (నిష్క్రమించును)

## ద్వితీయ రంగము

(ప్రవేశము - చండవర్మ ఖడ్గహస్తుఁడై)

చండ- నిర్విఘ్నముగఁ గార్యముల నెరవేర్చుటయందసమానప్రజ్ఞావంతులగు నా భటుల సాయమునను; నా బుద్ధిబలము పెంపునను: నేటికి నేఁ దలఁచిన పని సానుకూలమైనది. కాని యొక పొఱపాటొనర్చితిని. ఏమన నిదురించుచున్న యా చంద్రసేనునిఁ గడతేర్చుటకై కత్తి నెత్తియు నంతరాత్మ యంగీకరింపమి; నరణ్యమధ్యమున నాతని నంతమొందింపుఁడని విశ్వాసపాత్రులగు భటుల కాజ్ఞాపించితిని.

వారా వృద్ధునిఁ గనికరించి విడతురా? అట్లున్నటికిని జరుగ నేరదు. ఈసరి కా ముసలిరాజు దండధరుని యండకుఁ జేరియే యుండును. ఇంతకు ముందుగనే వృద్ధమంత్రిఁ గడ తేర్చితిని. ఇఁక వా రిరువురునూ పరలోకంబున యథేచ్ఛగఁ గొలువుఁ దీర్తురుఁ గాఁబోలు. చిగురు పుల్లలమంటవలె వేగిరపాటుఁ గల వయసుకుఱ్ఱఁడగు నా జయసేనుఁ డెందుఁ గానరాడే?

తే॥ గీ॥ కానవచ్చినచో వాని వాని తండ్రి
కడకు నంపెద సచివపుంగవుని పుత్రుఁ
డతులమతిమంతుఁ డేమాయె (యోజించి) నహహ తెలిసె
ప్రాణభీతిని నిర్వురుఁ బాఱి యుంద్రు॥

మఱియు;

ఆ॥ వె॥ ప్రాణభీతి నెటకొ పాఱిపోయినవారిఁ
గూర్చి వెఱువఁదగునె కొఱవిఁజూచి
భూతమని వెఱచెడి పోల్కి యథేచ్ఛగ
నవని నేలువాడ హర్షమెసఁగ॥

(మీసము మెలివెట్టుచూ) ఇఁక నన్నెవ్వ రడ్డఁగలరో చూచెదఁ గాక! (పోఁబోయి) జయసేనుఁడును; మంత్రికుమారుండును ప్రచ్ఛన్న వేషధారులై యీ పురంబుననే తిరుగుచుండిరేమో? తిరిగినఁ దిరుగ నిమ్ము. నన్ను వా రేమి సేయఁగలరు? మదగజం బరుగుచుండ సారమేయంబు లెంత గోల యొనర్చిన నది లెక్క సేయునా?

(నిష్క్రమించును)

### తృతీయ రంగము - కాళికాలయము

(ప్రవేశము, మతిమంతుఁడు యోగివేసమున)

మతి- (విచారముతో) కట్టా! చండవర్మ యెట్టినీచకార్యమొనర్చినాఁడు? వృద్ధ నరపతి విడయ మటుండ నా తండ్రిఁ గడ తేర్చినాడే? నా

యనువులఁ గాపాడుకొనుటకై యీ జడదారివేసము ధరింపవలసె. ఎవరో వచ్చుచున్నట్లున్నారు. (నిశ్శబ్దముగ దాగియుండును)

(ఇరువురు భటులు ప్రవేశము)

1 సే- (రెండవవానితో) మిత్రమా! చండవర్మగారిచే నాజ్ఞాపింపఁబడి మన రాజుగారగు చంద్రసేనునిఁ జంపుటకరణ్యమునకుఁ గొనిపోయితివట. నీకు సాయముగ మఱి యిరువురు భటు లరుదెంచిరట. వారి సాయమునఁ గరుణార్ద్రహృదయుఁడగు నా మహీపాలునిఁ గడతేర్చియే వచ్చితివా? చేతులార రాజుగారిని విశ్వాసము విడచి చంపుటకు నీ మన సొప్పెనా?

2 సేవ- లేదు. చంపి రాలేదు. (తనలో) పొఱఁబడితిని. నిజముఁ జెప్పితిని ఈ వార్త చండవర్మ చెవులఁబడిన నాప్రాణములు దక్కవు. (ప్రకాశముగా) కాదు. కాదు. చంపితిని. చేతులార చంపితిని.

1 సే- ఏమట్లు తడబడుచుంటివి? నీ ప్రాణమిత్రుఁడగు నాతో నిజ మొఱింగించిన నీ కేమి యుపకారముఁ గల్గును?

2 సే- (చెప్పఁబోయి సంశయించును)

1 సే- వృథా కాలయాపన మేటికి? నేఁ బోవుచున్నాడ (పోఁబోవ)

2 సే- (వారించుచు) మిత్రమా! పోవలదు. నిజమొఱింగించినచో "పెదవి దాటిన పెన్న దాటునన్నట్లు" ఈ వార్త నగరమంతయు వ్యాపించి తుదకు చండవర్మ చెవులఁబడి నే దండింపఁబడుదునను భయముచే సంశయించితిని.

1 సే- ఓహో! అటులయినరాజుగారిని చంపకయే విడచివచ్చితిరా?

2 సే- అగును. చేతిసంకెళ్లూడదీసి వృద్ధుఁడను జాలిచేతను ఎన్నాళ్ళనుండియో జీతమిచ్చి పోషించుచున్నరాజుగారను విశ్వాసము చేతను. చంపఁజేతులురాక నడవిలో రాజుగారిని ప్రాణములతో విడచివచ్చితిమి.

ప్రథమాంకము

1 సే- సఖా! మంచిపని యొనర్చితివి. నీ హృదయమున నంతటివిశ్వాస మున్నందులకే నెంతయు సంతసించితిని. మనమిఁక పోవుదము రమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు.)

మతి- సంతసమునభినయించుచు) ఆహా! ఎంతటి కర్ణానందదాయకమగు వార్త వినఁగల్గితిని? వృద్ధనరపతిని చంపకదేశ భటులు విడచివచ్చిరట. నేనిఁక యీ వేసంబుననే జయసేనుఁ గలసికొని వృద్ధనరపతి విషయ మాలోచించెదఁగాక. పాపము! జయసేనుండెట్టి దుర్గరణ్యములఁ బ్రయాణ మొనర్చుచున్నాఁడోగదా! (నిష్క్రమించును)

## చతుర్థరంగము

(ప్రవేశము - జయసేనుఁడుయోగి వేసమున)

జయ- కట్టా! చండవర్మ నిగురించుచున్న నాతండ్రిని భటులసాయమున నెందేనిఁ జేర్పించి చంపించి యుండుననిగదా విష్ణుశర్మచెప్పినది. ఒడలు మఱచి నిదురించుచున్న నాతండ్రిఁ జంపఁదలఁచి వచ్చిన యాచండవర్మ చంపక భటులసహాయమునగుప్త మార్గమునుండి యెందేనిఁ దెప్పించుటకు కారణమేమై యుండును? చేతులార వధించుటకు మనసొప్పమియే కారణమగునా? (యోజించి) పొఱబడితిని అనుదినంబును హత్యలవలీలగ నొనర్చు నాకఠినహృదయునకు నాతండ్రిని వధించుటొక లెక్కయా? తప్పక వధించియేయుండును. (చండవర్మ నుద్దేశించి) కృతఘ్నా! కులపాంసనా! పురవాసులెన్ని మారులు నీ దుండగములఁ గూర్చితనకడ మొఱవెట్టుకొనిన నొక్క సోదరుఁడవను ప్రేమచేదండించుటకు మారుగ దుండగములు మానుమని మందలించుటయు నీకుఁగోపకారణమయ్యెనా?

తే॥ గీ॥ బాల్యమాదిగ పామును పాలుపోసి
పెంచినను దానివిసమొంతో వృద్ధిఁజెందు
కరణిహితబోధ సేయుమున్కరున కదియు
నాగ్రహముఁ గల్గజేయుట యబ్బురంబె?

(కోపము నభినయించుచు) వసివసమందె గతించిన తల్లియటుండ దండ్రిఁ జేతులార వధించిన నీవు నాపాలిటిపిడుగువుగాని పినతండ్రివి గావు. నిన్ననాటికైన

చ॥ అనిమిషులెల్లరొక్కటయి యాహవభూమికి నేగుదెంచినన్
ఘనుఁడు త్రినేత్రుఁడే స్వయముగా నరుదెంచినఁ గావఁబూనినే
ననుపమశౌర్య మేర్పడఁగ నాహవరంగమునన్ దురాత్మ ని
న్ననిపెద కాలుప్రోలికి జనార్దనపాదసరోజసాక్షిగన్॥

(ఆకసమువంకఁజూచి) భానుఁడపరగిరి శిఖరము నలంకరింపఁ బోవుచున్నాఁడు. నే నీ ఘోరారణ్యమున నింకను జాగు సేయరాదు.

(ఒకదెసఁజూచి)

తే॥ గీ॥ అరయదాపున నేదియో పురవరంబుఁ
గలదటంచును దోఁచెడిఁ గాన నేను
దానిఁ జేరంగ నేగెదఁ ద్వరితగతిని
భానుఁడస్తాద్రి చాటునఁ బడకమున్న

(నిష్క్రమించును





# జయసేనవిజయము



## ద్వితీయాంకము



ప్రథమరంగము : ప్రభావతీ యుద్యానవనము.

(ప్రవేశము జయసేనుఁడు యోగివేసమున)

జయ. కంటకశిలావృతమగుకీకారణ్యమున నడచివచ్చుటఁజేసి పాదములెంతయుఁ గందినవి. అడుగైన నిడఁజాలకున్నాఁడ. (ఎదుటఁజూచి) ఈ వనమునందలి తరులతాదులఁగాంచిన నా కెంతయు సంతసము జనించుచున్నది. ధనముగల్గినాతనే గర్వించి, పేదజనుల నాదరింపక యాధనము నొకచోఁదాచియుంచి; దానిలో తామును మాత్రమైన ననుభవింపని లోభులవలెఁగాక;

మ॥ వినయంబచ్చుపడంగ పాంథజనులన్ వేవేగరమ్మంచు తా .
రనయంబున్ తమకొమ్మలన్ మెలపి మార్గాయాసమున్ దీర చ
ల్లనివౌ నీడలొసంగి పండ్లనిడి యుల్లాసంబు సంధించు నీ
వనవృక్షంబుల త్యాగమిట్టి దనినే వర్ణింపఁగా నేర్తునే॥

(ఎదుటఁజూచి యాశ్చర్యముతో)

ఉ॥ గౌరవమందు పూరుషునిఁగాంచియు నోర్వక దుర్జనుండు ని
ష్కారణమా మహామహుని గౌరవహీనునిఁ జేయయత్నముల్
నేరిచినట్లొనర్చుగతి నేర్పుగఁ బాంధులదన్ను కోయిలల్
పౌరుసమొప్ప వెంటఁబడి పఱ్వగఁ జేసెడికాక మిచ్చటల్॥

(కొంతవడి యోజించి) వసంతసమయ శోభితంబైయొప్పు నీవన శృంగారముఁ గాంచినకొలఁది యిచ్చటినుండి పోవుటకుఁ గాళ్లాడకున్నవి. ఈ చూతవృక్షచ్ఛాయఁ గొంతవడి విశ్రమించి యరిగెదఁ గాక (ఆసీనుఁడై, వినుటనభినయించి) అందుగుల యలికిడి వినవచ్చుచున్నది. ఎవరోయిటే వచ్చుచున్నట్లున్నారు. వారిజోలినాకేల ? నే నిటఁబరుండి మేనికిఁదగు హాయినొసఁగెదఁగాక. (పరుండును)

(ప్రవేశము; ప్రభావతి తనసఖయగుమల్లికతో)

ప్రభా- చెలీ! దేహమునకల్లనల్లనసోకి యఖండమగు సుఖంబు నొసంగుచున్న మందమల యానిలుని ఋణము వేయిజన్మములకైనఁ దీర్చుకొనఁ జాలముసుమా! (అటునిటుఁజూచి) మల్లికా! ఆ చూతవృక్షచ్ఛాయ నెవరో పరుండియున్నట్లున్నది. చూచివత్తమురమ్ము. (సమీపించి) సఖీ! ఈతఁడు నిదురించుచున్నట్లున్నాడే! (బాగుగాఁ బరిశీలించి తనలో) భటులచేఁ జిత్రపటమునంపి నాహృదయంబును హరించిన, జయసేనరాకుమారుని పోలిక లీ సన్యాసియందుఁ గన్పట్టుచున్న వేమి? (ప్రకాశముగా) సఖీ! మనమిందేయుండి మాటాడుచున్న నీ పురుషసింహుని నిద్రకు భంగముఁ గల్గించినవారమగుదుము. కావున మన మా కమలాకరంబుదరి కేఁగుదము రమ్ము.

జయ- (మేల్కొని విస్మయముతో) నే నొక లావణ్యరాశియగు కన్యకామణితోఁ గలసి యీ వన రామణీయకమును వీక్షించుచున్నట్లు కలఁ గంటిని. స్వప్నములు భావికార్యములను సూచించునందురు. (యోజించి) నాకంతటి యదృష్ట మబ్బునా ?

మల్లిక- రాకుమారీ ! ఆ పురుషకంఠీరవుండు మేల్కాంచినాడు. అతని వృత్తాంతం బరసి రమ్మందువా ?

ప్రభా- అరసిరమ్ము. పొమ్ము వారియెడ వినయవిధేయతలఁ గనఁబఱు పుము.

మల్లిక-(జయసేనునిసమీపించి) పురుషవరేణ్యా! మీరీ యుద్యానవనము లోని కేల వచ్చితిరి ?

జయ- తరుణీ! ఈవనమునందలి మనోహరమగు తరులతాగులు నన్నా కర్షించుటయే నే నిందుఁ బ్రవేశించుటకుఁ గల కారణము.

మల్లి- మీ ముఖలక్షణంబులును మాటల తీరునుఁ జూడ సత్కులజులని తోఁచెడిని. మీరీ యోగివేసము ధరింపనేల ?

జయ- నేని యోగివేసము ధరించుటకు కాలమే కారణము.

ప్రభా- (ప్రవేశించి మల్లికా! నన్నొంటిగా విడచివచ్చి. సుభద్రఁ జరి ణము బాడ నేఁతే విని పాండవమధ్యమునివలె యోగివేసమున నున్న యీ పురుషకుంజరవునితో సంభాషించుచు జాగొనరించు చుంటివే

మల్లిక- రాకుమారీ' అతిధిగమై వచ్చినవారి నాదరింపవలదా ? (జయ సేనునితో) పురుషాగ్రగణ్యా' మీ నామధేయమేమో తెలవీయ గలరే ?

జయ- తరుణీ'

తే। గీ। కాంచనపురాధినాథుఁడై కరుణమీర
ప్రజలనెల్లర బిడ్డలవగిదిఁ జూచు
నట్టి చంద్రసేనుని కేను పట్టి నగుదు
నార్యు లెల్లరు జయసేనుఁడందు రన్ను॥

ప్రభా-(తనలో) నా మనసు మానుమూరకపోలేదు. ఈతఁడే నా హృదయ చోరుఁడగు జయసేన రాకుమారుఁడు

మల్లిక- (ప్రభావతిచెవిలో) చెలీ' వింటివా ? ఈతఁడే జయసేనుఁడట. కాలవశమున నీపై రాగివేసమును ధరించినాడట (జయసేనునితో) రాజకుమారా ! రాకన్నియ లుండెడి యుద్యానవనములోనికి మీబోటి నవయౌవనులు రావచ్చునా ?

జయ- నేనిప్పుడిందుఁ బ్రవేశించినందులకై మీ రాజకుమారి నన్ను

దండించుఁగాఁబోలు?

మల్లిక- దండించునో, పూదండలచే నలంకరించునో యెవరి కెఱుక!

జయ- (తనలో) ఈరాజకుమారి నన్నుఁ బ్రేమించి యున్నట్లు ఈ మల్లిక మాటలవలనఁ దేటపడుచున్నది. అయిన నిట్లని చూచెదఁగాక! (ప్రకాశముగా) మల్లికా! నీవనినట్లు రాకన్నియ యిటుడెసి యుద్యాన వనమున నేనుండరాదు. కావున నేఁ బోవుచున్నాఁడ. (పోఁబోవును)

మల్లిక- రాకుమారా! మీరు పోవలదు. మాటపరుస కట్లంటిని. పర పురుషులుండుట పాడిగాదనుమాట సత్యమేగాని నీవు పరపురుషుఁడ వెట్లాదువు?

జయ- (స్వగతము) మల్లిక పలుకులవలన రాజకుమారి యభిప్రాయము మఱింత బోధపడుచున్నది.

మల్లిక- రాకుమారా! ఒకమాట! నవవయోవిలాసవతియగు రాకు మారి యొకతె: మీ మనోహరాకారమునే మనోవీథిని నిల్పి; మీ నామజపంబునే సదా యొనర్చుచు భవద్దర్శనాభిలాషిణియై నిముస మొక యుగముగ గడపుచున్నది.

జయ- ఆ కన్నియ పేరేమి?

మల్లిక-అమె యిప్పుడొక వేళ మీయెదుటనే యున్న చో మీరామెనాద రింతురా?

జయ- ఆ కన్నియ యెవరో తెలియఁజేయరాదా?

మల్లిక-విద్యావతియు, వివేకవతియు, నవవయోవిలాసవతియు నగు మా రాజకుమారియే పేరున ప్రభావతి.

జయ- (తనలో) ప్రకృతపు నా యభాగ్యత వినియు యీకన్య మిన్న నిజముగా నాపై ప్రేమ విడువకున్నదా?

మల్లిక- (తనలో) ఈతఁ డేదియో యోచించుచున్నాఁడు. వీరిరువుర నొకచో విడిచివెళ్ళిన, వీరి మనోలతిక లల్లిబిల్లిగ నల్లుకొనఁగలవు. (ప్రకాశముగా) ప్రభావతీ! నే నా కమలాకరంబు దరి మఱచివచ్చిన కుంకుమ కుసుమమాలఁ గొనివచ్చెద. నీ విందే యుండుము.

## ద్వితీయాంకము

ప్రభా- నన్నొంటిగా విడిచి వెళ్ళెదవా ?

మల్లిక- ఈ రాకుమారుఁడు చెంతనుండ నీ కేమిభయమమ్మా? (నిష్క్రమించును)

జయ- (తనలో) ఈమె మనోభిప్రాయంబెట్టులుంగుటకై యిట్లని చూచెదఁగాక! (ప్రకాశముగా)

క॥ అనుదినముఁ విహరించెడి
వనమున నీ కేటిభయము వారిజనేత్రీ!
చనుచుంటి నాదు ప్రోవను
ఘనమతి నెవ్వానినైనఁ గామింపుమికన్ ॥

ప్రభా- సుకుమారాకారా! భవదీయమనోహరాకార సందర్శనాభిలాషనై నిముసమొకయుగముగ గడుపుచున్న యీ ప్రభావతితో మనసిచ్చి మాటాడకయే పోవఁ దలఁచుచుంటిరా ?

జయ- (తనలో) ఈ రాకుమారి మనోనిశ్చయమును బాగుగా పరిశీలించెదఁగాక! (ప్రకాశముగా) రాకుమారీ! పరపురుషుఁడనగు నాతో నవనవయౌవనవిలాసవతివగు నీ విట్లనుమానింపక పలుకఁదగునా?

ప్రభా- పరపురుషుండనెట్లయితివి? భటులచే చిత్రపటమునంపి మరులుగొలిపి నా హృదయంబును హరించిన చిత్తచోరుఁడవుఁ గావా ?

జయ- నన్ను వరించి నీ వేమి సుఖంబు లందనెంచితివి ?

మ॥ అతివా! రాజ్యసుఖంబులన్ విడచి యాయాదేశసంచారమే
గతిగా నల్పవిరాగినై యిటుల భాగ్యత్యాగినై యుండుభూ
పతిపుత్రున్ ననుఁ గోరి యేమిసుఖముం బ్రాపింతువీభామినీ
మతికెవ్వానినుఁ దోచరే పతిగ సంభావించిపెండ్లాడఁగన్ ॥

ప్రభా- మనోహరా! తనరాజ్యంబంతయు శత్రురాజులుహరింప; ముదుసల్లను, అంధులునగు తలితండ్రులఁబోషించుచూ, వనవాసమొనర్చు, సత్యవంతుని సావిత్రివరింపలేదే ? వేయేల?

తే॥ గీ॥ నిన్నుఁ బొడ్గాంచి సుఖముల నెనయనేని
రూపజితపంచబాణ! నీరూపురేఖ
లాత్మఁ దలఁచుచుఁ బ్రాణంబులైనవిడచు
టది నిజంబనినమ్ముమా మదినినీవు!

జయ- (తనలో) ఈమెమనోనిశ్చయ మిప్పుడు తేటపడినది. (ప్రకాశముగా) రాకుమారీ? నీవంతటిదృఢ నిశ్చయురాలవే యనువిషయము నాలపించుచుటకై తలలూపుచున్నవో యన్నట్లు, గాలికిఁ గదలు గులాబిమొక్కలఁ గాంచితివా?

ప్రభా- మనోహరా! పచ్చనియాకులకును తమకును రంగులో నే మాత్రము భేదములేదని లోకమునకుఁ జాటుచున్నవో యున్నట్లు లాకుల మాటునడాగి, చిలుక లెల్లఱచుచున్నవో వింటిరా?

జయ- సుందరీ! మనోహరమైనలత యొక్కటి చెంతనున్న తరురాజమున కల్లిబిల్లిగ నల్లుకొని, వదలఁజాలక ముద్దిడుచున్నదో యన్నట్లు ప్రేమానుబంధమునుసూచించుచు మెట్టలరారుచున్నదో చూచితివా

ప్రభా- చూచితిని, అటుచూడుడు. తరుశాఖయొక్కటి పవనదేవుని యాహ్వానించుచున్నదో యన్నట్లెంతో రమణీయముగఁ జలించుచున్నదో.

జయ- (చిఱునవ్వుతో) తరుణీ! ఏమంటివి? నీ కేగాక, నీ వనువినంబున విహరించెడి యుద్యానవనము నందలి తరుశాఖలకు సైతము వారిఁ బోవు వారిఁ బిలచి యానందమునంగఁ జేసి పంపుసామర్థ్యముఁ గల దనియా?

ప్రభా- (సిగ్గుతో తలవంచును)

జయ- సుందరీ!

మ॥ ఘనమార్తాండ సాంధ్యవాండతమమ్ముఁ ఖండింప నేతెంచు నా
ఘనదీపంబన యామినీయువతి మాంగల్యంబనఁ దూర్పునఁ
గనుమాప్రాగ్యువతీ ముఖాబ్జమున లగ్నంబైన సిందూరమో
యన సంద్రంబులుఁ బొంగఁగాంతి యుతుఁడై యబ్జారిగన్పట్టెడిన్॥

ప్రభా- (ఎదుటఁజూచి) అశ్రుకణపరీతమై, కళావిహీనమైయున్న ముఖ

బింబము చింతాకులితస్వాంతమై యున్నదని తెలియఁ బఱచుచుండ, నడుగులు తడఁబడ, వడివడిగ మల్లిక యిటకరుదెంచుచున్నది.

మల్లిక- (ప్రవేశించి, విచారముతో) సఖి! నీముద్దుల సోదరుఁడగు ప్రద్యోతనుఁడు మంత్రియగు కుమతిగారింటి కాటలకేగి ప్రొద్దుఁ గ్రుంకిన నింటికి రాకుండుటచే మీ నాయనగారా బాలునికై మంత్రిగారింటికి భటులనంపిరట.

ప్రభా- ఏమీ! నా సోదరుఁ డచట లేఁడా?

మల్లిక- అచ్చట లేఁడు సరేగదా పురమునందెచ్చటఁ గానరాలేదనియే వెనుక నేగినభటులు చెప్పికొనుచుఁ బోవుచుండిరి.

ప్రభా- వారేనీకే వృత్తాంత మెఱిఁగించిరా?

మల్లిక- ఔను.

ప్రభా- (జయసేనునిదిక్కు మొగంబై) మనోహరా! సోదరునిఁ గూర్చిన చింతచే నితికర్తవ్యతా మూఢురాలగు నీ దీనురాలికి తెలవిండు.

జయ- రాకుమారీ! ఎన్నటికేని నాకష్టములు గట్టెక్కకపోవు. రాజ్యము నా స్వాధీనముఁగాకపోదు. అప్పుడు నిన్నుఁదప్పక వివాహమాడెద. జాగేల? వేగమేయంతి పురమ్మునకుఁబోయి నీ సోదరుని వృత్తాంతం బరయుము. పొమ్ము, నేఁబోవుచున్నాడ. (నిష్క్రమించును)

ప్రభా- మల్లికా! నీకావార్త నెఱింగించినభటులు నాతండ్రిగారికడ కరుదెంచి యుందురు. నీకుఁగనపడి పోయినతరువాత వారెచ్చటనైన సోదరునిఁ గనుఁగొనఁ గలిగిరేమో? పోయి యావిషయము విచారింతమురమ్ము. (ఇరువురును నిష్క్రమింతురు)

(ప్రవేశము యిరువురుభటులు)

1భ- (రెండవవానితో) మనమురాజుగారి కుమారునికై వెదకి వెదకి వేసారితిమి ఎచటఁగానరాడాయె. కానరాలేదని చెప్పి రాజుగారుమనలఁ దండింపక మానరు. కావున దిక్కులేనివాని నెవ్వనినైనఁదోడ్కొని పోయి, ద్రోహియని నరపతిమోలనుంచుదము.

2భ- నీయుపాయమున కేనుమాత్రము కాదందునా ? (మరియొక ప్రక్కనుండి జయసేనుఁడు ప్రవేశము)

1భ- మనయోజనకు వైరాగియైనసరిపోవునట్లున్నది. (జయసేనునితో) ఓయీ! నీవెవ్వఁడవు?

జయ- (తనలో) వీరికి నా నిజవృత్తాంత మెఱింగించినఁగలుగు ప్రయోజన మేమి? (ప్రకాశముగా) నేనెవ్వఁడ నైనదినా వేసమే తెలియఁబఱచుటలేదా ?

2భ- నీకుగొప్ప పారితోషికమురాఁగల అప్పఁజూపెదము మాతో వచ్చెదవా?

జయ- నాకుఁబారితోషికమా ? ఎవరిత్తురు ?

1భ- మారాజుగారికి బైరాగులవాక్కులందెక్కుడు విశ్వాసముఁగలదు. వారి కుమారుఁడు నేటిసాయంతనము నుండి యెచ్చటఁగానవచ్చుటలేదు. మీరాబాలుండెచటనున్నాఁడో చెప్పఁగలుగుదురేని మా రాజుగారు మిమ్ములఁ దప్పకబహూకరింతురు.

జయ- (తనలో) వీరి వెంట రాజాస్థానమునకేగి నరపాలునికి జాలి గలుగునట్లు నాదీనదశఁ దెలియఁబఱచియేదేని యుద్యోగమును సంపాదించెదఁగాక! (ప్రకాశముగా) అటులేపోవుదము. నడువుడు.

2భ- (తనలో) ఇప్పటికి ముప్పుఁగడచితిమి. ఇతఁడే మీకుమారునిఁ జంపినద్రోహియని రాజుగారితని శిక్షింపఁగించెదముఁగాక! పాప మీతఁడు పారితోషికముఁబడయుగనని సంతసించుచున్నట్లున్నాఁడు ద్రోహియనివినినంత రాజుగారు కారాగారమునఁద్రోయుదురని యెఱుఁగఁడు (నిష్క్రమింతురు)

తృతీయరంగము - చెఱసాల

(ప్రవేశము జయసేనుఁడు)

జయ- ఔరా! భటులెంత మోసముఁ జేసిరి. పారితోషికము నిప్పింతుమని నన్నుఁదోడ్కొని వచ్చి భూనాథునితో నేవియో కొండెములఁ జెప్పి

కారాగార వాసమునందఁ జేసిరి. భూపతియైనను భటులు పలికిన
సదే వేదవాక్యముగ నమ్మి నిరాలోచన పూర్వకముగ నిరప
రాధినగు నన్ను శిక్షింపవచ్చునా? (ఆలోచనము సలిపినయిూది) నా
చరిత్రమెంత చిత్రముగ నున్నది?

తే॥ గీ॥ ధరణిభారము బూనుమో తనయ యంచుఁ
దండ్రి నాతోడ నేటికిఁదా వచించె;
అటువచించెనుఁ బో వాని యనుజుఁ డిటుల
బాధలఁ బెట్టఁదగునొక్కొ? పాపమనక.

తే॥ గీ॥ పట్టిఁబో పూర్వజన్మ బుఁ బట్టి వచ్చు
కర్మఫలమని యనుభూతిఁ గాంచుచుండ;
కష్టముః నెన్నఁ జెలుఁగని కన్నె మిన్న
యీ ప్రభావతిఁ నన్న ప్రేమింపనేల?

(వెనుకనుండి మెల్లగా కుమతి ప్రవేశము)

కుమ- (తనలో) రాజకుమారునిఁ జంపెను నేరముపై కారాగారా
మునఁ బెట్టఁబడిన సన్యాసి యీతఁడేయైయుండునో పు మాటునదాగి
యీతఁడేమనుకొను చున్నాడో యాలకించెదఁగాక!

జయ- కట్టా!

తే॥ గీ॥ పలుకపకారమెన్న ను జఱిపియెఱుఁగ
నట్టి నను ద్రోహిగా నెంచి యవనినాథుఁ
డిట్లు చెఱఁబెట్ట యీముప్పు నెట్లుగడచు
వాఁడ? సత్యమె పరు బయల్ పఱుపఁగలరు?

కుమతి- (తనలో) ఏ నేరమెఱుంగకయే శిక్షింపఁబడిన తనకీముప్పుగడచు
టెట్లాయని యీతఁడు యోజించుచున్నాడు యుక్తాయుక్త విచా
రశూన్యుఁడగు ధర్మపాలుఁడీతనిని నిర్దోషిఁగా నెఱిఁగి; తనకొమరునిఁ
జంపఁబంపినది నేనే యని గ్రహింపఁగలఁడా? గ్రహింపఁజాలడు.
ముమ్మాటికిని గ్రహింపఁజాలఁడు. గ్రహింపఁ గల్గుటకవకాశమెంత
మాత్రమును లేదు, నాయందలి విశ్వాసముచేనైన మన్నింపక నా
మేనల్లున కురిశిక్ష విధించిన యీ ధర్మపాలమహీపాలుని వంశము

ద్వ్యాంశమునుఁ జేయునెంచి యాశనికుమారుఁడగు ప్రద్యోతనుని . బట్టి దవ్వులఁ బాఫిరఁడని భటులకాజ్ఞయొసఁగితిని. నాభటులతి రహస్యముగ వానిఁగడతేర్చియేవత్తురు బాలునిఁ జంపెనను నేరమాతనిపై మోపఁబడినది గాన విచారణదినమున నీతనికురిశిక్ష విధింపఁజేసినేఁ జేసిననేరమెట్లును బయల్పడదు గాననేనే సుఖంబుండెదఁగాక? (పోబోయి) మఱచితిని. మొన్న ప్రధానామాత్యుఁడగు సుమతి; "యీ సన్న్యాసిద్రోహమొనర్చెనఁ దానునమ్మఁజాలననియు,నాల్గుదినంబులు గడువొసఁగిన నేరమునందలి నిజానిజంబులఁ గనుఁగొనెద"ననియుఁ జెప్పినరపతికడ నాల్గుదినంబులు గడువుఁదీసికొనెను ఆతఁడెట్లు నేఁజేసిన నేరమును బయల్పరుపఁగలఁడో చూచెదఁగాక! (నిష్క్రమించును)

(ప్రవేశము సుమతి)

సుమతి- పురుషవరేణ్యా! మీరేద్రోహమొనర్చి యిట్లుశిక్షింపఁబడితిరి?

జయ- తమరెవరో, నన్నిందులకై యిట్లుప్రశ్నించుచుంటిరో యెఱుగవచ్చునా?

సుమతి- నిరాలోచన పూర్వకముగ మీకీ శిక్షవిధించిన ధర్మపాలమహీపాలునికడఁ బ్రధానామాత్యుఁడ. నాపేరుసుమతి యందురు.

జయ మహాభాగా! నే నేనేరమొనర్చి యిట్టి శిక్షకుఁబాత్రుఁడనైనది నే నెఱుఁగను మీరెఱిఁగియున్న సెలవీయవలసినదని ప్రార్థించుచున్నాను.

సుమతి పురుషవరేణ్యా! రాజుగారి కుమారుఁడగు ప్రద్యోతనుఁడను బాలుని వధించితిరను నేరముపైమీరిట్లు శిక్షింపఁబడితిరి. మీరట్టి ద్రోహమొనర్చితిరన నే విశ్వసింపక, నరపతినినాల్గుదినంబులు గడువడిగి, నేరమునందలి నిజానిజంబులఁ గనుఁగొన యత్నించుచుంటిని. నాశక్తివంచన లేకుండఁ బాటుఁబడి సత్యమును బయల్పఱిచెద. (ఎదుటఁజూచి) ఎవఁడో సేవకుఁడిట కరుదెంచుచున్నాడు.

(ప్రవేశము సేవకుడు)

సేవ- (సుమతిగాంచి) దేవా! జయము కలుగుఁగాక!

సుమతి- సేవకా! విశేషము లేమి?

సేవ- (దుస్తులలోనుండి యొక జాబును వెలికిఁదీసి) దేవా! యీయుత్తరమును పరిశీలింపుడు.

సుమతి- (యుత్తరముఁదీసికొని, యామూలాగ్రముగఁ జదివి, సంతోషముతో) సేవకా! నీ కీ యుత్తరమెట్లు లభించినది?

సేవ- దేవా! నాలుగైదు దినములక్రిందట నాకాంతరంగిక మిత్రుఁడగు భటుఁడొకఁడు కుమతిగారింటికిఁబోవుచుండఁగాంచి విశేషము లేమని యడిగితిని. "కుమతిగారు, సేనాధిపతిగారకు వ్రాసియిచ్చిరొక యుత్తరమిమ్మనఁ బోయి వారింట లేకుండుటచే మగిడి మంత్రిగారింటికిఁ బోవుచుంటి"నని యాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. అంతట నే నా యుత్తరము నడిగి తీసికొని చదువ మొదలిడితిని. దేవా! ఏమిచెప్పుదును? వెంటనే నాకనులశ్రుపూరితమైనవి. స్వరముగద్గదవడినది. కాలుఁ జేతులుఁ గంపింపఁదొడఁగినవి.

సుమతి- ఆభటుఁడు చదువ నేర్చినవాఁడుఁ గాఁడుఁగాబోలు

సేవ- దేవా! ఔను. ఆతనికిఁ జదువురాదు. కావుననే కుమతిగారాతని కాయుత్తరమొసఁగిరి. అన్యులకుఁ జూపవలదనియు హెచ్చరించిరట ప్రాణమిత్రుఁడనగుటచే నాకాతఁడాయుత్తరముఁ జూపెను.

సుమతి- అప్పుడప్పుడాభటుఁడు కుమతియొద్దనుండి యుత్తరములఁగొని పోవుచుండుటయు; నచ్చటనుండి యేని దెచ్చియిచ్చుచుండుటయుఁ గలదా?

సేవ- దేవా! కలదట మంత్రిగారాతనిని బాగుగానమ్ముచుందురట

సుమతి- సరే! అంతట నీవేమి చేసితివి?

సేవ- దేవా! ఆయుత్తరమును నేఁదీసికొని "మిత్రమా! ఇదొక పరమ రహస్యాంశము వ్రాయఁబడియున్నది. మనరాజుగారికీయుత్తరముఁ జూపుదుమేని మనకు గొప్పపారితోషికము రాఁగలదు. కావున నీవుఁబోయి, సేనాధిపతిగారింట లేడనియు; తిరిగివచ్చుచుండఁ దారి

లోనుత్తర మెచ్చటనో పోయినదనియుఁ జెప్పుమని బంపితిని, మఱల నాకాతఁడెచటఁ గన్పడ కుండుటచేయు త్తరమెచటనో పోయిన దన్నంగలత్తె, కుమతిగారిచే, నామిత్రునకే మైనహాని వాటిల్లెనేమో యని శంకించి; యాతని వృత్తాంతమునరయుఁడని మీతో మనవి. జేసికొనుటకై వచ్చితిని.

సుమతి- సరే! రేపు విచారణదినమున రాజాస్థానమునకు హాజరుఁగమ్ము (సేవకుఁడు నిష్క్రమించును)

జయ- మంత్రిసత్తమా! ద్రోహమునందలి సత్య మెంతచిత్రముగ బయ ల్పడినది?

సుమతి- మహాభాగా! నిజముబయల్పడకుండునా? రాజాస్థానమున విచా రణ సమయమున జనపతికీజాబుఁజూపి యాకుమతికిఁ దగు దండన విధించు నట్లొనర్చెదనేనిదే పోవుచున్నాడ. (నిష్క్రమించును)

(అవనిక జారును)

చతుర్థరంగము- ధర్మపాలుని యాస్థానము.

ధర్మ- సుమతీ! యీ బైరాగి నాకుమారుఁడగు ప్రద్యోతనునిఁ జంపెనను నేరమునందలి యథార్థమును గనుఁగొనఁ గలిగితివా?

కుమతి- (సుశీలుని అర్థోక్తిలో; వడివడిగాలేచి) రాజా! ఇంకను యీ బైరాగి ద్రోహిగాడనియా మీసందియము. ఈతఁడేయాపసివానిఁ బట్టివధించిన పాపాత్ముఁడని నాకుఁదోచెడిని. ఈతనికిఁదప్పక యురి శిక్ష విధించుటయే మేలు.

సుమతి- రాజేంద్రా! యీ ద్రోహమొనర్చిన పాపాత్మున కురిశిక్షవిధిం చుటయే మేలు, కాని యీబైరాగిమాత్రము ద్రోహిగాడు. ఈ యుత్తరమునుపరిశీలింపుడు. ద్రోహియెవ్వరైనది మీకే విశదము కా గలదు.

ధర్మ- ఆయుత్తరమందేమికలదో నీవేచదువుము.

సుమతి- (ఉత్తరమానుచూచుచు) శ్రీ శ్రీ శ్రీ ధర్మపాలమహీపాలుని సేనలకెల్ల నధిపతియగు వక్రబుద్ధికి, నీ ప్రియమిత్రుఁడు కుమతి

వ్రాయునదేమన నామేనల్లుఁ డొకస్వల్పనేరము నొనరింప నాయందలి గౌరవముచేనైన నతనిని మన్నింపక దానికై యాతనికి మరణదండన విధించిన మనధరణీధవుని సాధించుటెట్లని నీతోననేకమారులు యోచించియుంటి నీవును మఱచియుండవు. మాయింట నాటలాడు కొనుటకై యరుదెంచిన ప్రద్యోతనుని నట్టడవులఁ జంపిరండని విశ్వాసపాత్రులగు భటుల కాజ్ఞాపించితిని. నేనిత్తునన్న పారితోషికము నందలి యాసచే రాజకుమారుఁడనియైన జంకక వారాతనిఁ గడతేర్చుట కరణ్యమధ్యమునకుఁ గొనిపోయిరి. వారాతనిఁ గడతేర్పక మానరు అతని మరణవార్త మనము వీనులార వినఁగలము. అంతదనుక నీకీ విషయమెఱింగింప కుండుటకు నామనసంగీకరింపకఁ బోవుటచే విశ్వాసపాత్రుఁడగు నీభటునిచే నీకుఁ దెలియఁ జేసితిని.

ఇట్లు,

కు మ తి.

కుమతి- (తనలో) సుమతి జనపతికేదియో జాబుఁజదివి వినిపించుచున్నాడు. నాచే వక్రబుద్ధికి వ్రాయఁబడిన జాబిదియేమై యుండదు గదా! జాబుఁగొనిపోయిన భటుఁడు మఱలివచ్చి యుత్తరమెచ్చటనో పోయినదని చెప్పిన నాతనివాక్కులను విశ్వసింపక యీ రహస్య మాతనితోనే యంతరించుటకై తత్క్షణమే యా భటుని దండధరుని యొండకుఁ జేర్చితిని. అట్టిచో వీరికా యుత్తరమెట్లు లభింపఁ గలదు?

ధర్మ- సుమతీ! నీకీ యుత్తరమెట్లులభించినది?

సుమతి- దేవా! ఈసేవకునిఁ బ్రశ్నించిన నంతయుఁ జెప్పఁగలఁడు.

ధర్మ- సేవకా! నీకీ యుత్తరమెవ్వరిచ్చిరి?

సేవ- దేవా! ఈ యుత్తరమును సేనాధిపతిగారికిమ్మని; కుమతిగా రొక భటునిచేఁ బంపిరట ఆ భటుఁడు పోవుసరికి సేనాధిపతి గారింట లేకుండుటచే తిరిగి యాతఁడు మంత్రిగారింటికిఁబోవుచూనాకుఁ గనఁబడినాడు. అతఁడు నాకాంతరంగిక మిత్రుఁడగుటఁ గుశల ప్రశ్నలడిగి

తదుపరి యా యుత్తరము నాతనివద్దనుండితీసికొని యందలి విషయమును చదివితిని. చదివి 'మిత్రమా, యీదొక పరమరహస్యము వ్రాయఁబడియున్నది దీనిని మనరాజుగారికిఁ జూపితిమేని మనకు గొప్ప బహుమానము వచ్చును. కావున నీవిప్పుడీయుత్తరమును నాకిచ్చి, మంత్రిగారి యొద్దకుఁబోయి; సేనాధిపతి గారింట లేడనియు, తిరిగి వచ్చుచుండ దారిలో నుత్తరమెచ్చటనో పోయినదనియు, జెప్పు'మని చెప్పిపంపితిని. అతఁడు నామాటలకంగీకరించి యా యుత్తరమును నాకిచ్చి మంత్రిగారింటికిఁ బోయెను మరల నాకాతఁడెచ్చటఁ గన్పడకుండుటచే మంత్రిగారాతని మాటలనునమ్మక యాతనికేమైన హానిఁగూర్చిరేమోయని శంకించి, యీ పెద్దమంత్రిగారి దగ్గఱకువచ్చి, యీ యుత్తరమునిచ్చి నా మిత్రునివిషయమై విచారింపుఁడని కేల్మోడ్చి ప్రార్థించితిని. రాజసభకీనాడు హాజరుగమ్మని వీరు నాకుత్తరువొసంగుటచే వచ్చితిని. దైవసాక్షిగ నేనెఱింగినదంతయు నిజము నే చెప్పితిని.

ధర్మ- సేవకా! నీవావలకుఁబొమ్ము. (కుమతిఁజూచి) కుమతీ! ఈయుత్తరము నీచేవ్రాయఁబడినదగునో కాదో చూడుము (త్వరగా జూపించిమఱుఁగు పరచును)

కుమ- దేవా! అయ్యది నాచేవ్రాయఁబడినదికాదు.

ధర్మ- (ఆగ్రహముతో) కుమతీ! నీద్రోహమంతయు నిందులోనే వెల్లడియైనది. లేఖనుసరిగావీక్షింపకయే నీచేవ్రాయఁబడినది కాదంటివే? నీచేవ్రాయఁబడినదేయై యుండుటచే కాదనఁదలఁచి యట్లంటివిగాని నిజముగా నీవిప్పుడీజాబును పరిశీలింపనేలేదు. అదియునుఁగాక, నాకదమంత్రివగు నీయక్షరవైఖరి నేనెఱుంగనా? ఈజాబు నీచేలిఖింపఁబడినదే. స్పష్టముగా వంతియే నాచేమరణదండనకుగురియైన నీమేనల్లుఁడు నిరపరాధియా? నీకాతఁడు ద్రోహియనితోఁచుటలేదా?

తే। గీ॥ ఒడలుమఱచి నిద్రించెడి యొక్క వైశ్యుఁ
జేతులార వధించిన చెనటిఁబట్టి
ఘోర శిక్షవధించుట నేరముగనుఁ
దోచనే భావమునఁనీకు దుర్మదాంధ!

(ఆగ్రహముతో) ఔరా! కుమతియను నీనామధేయమును సార్థకమొనర్చితివే! నీవొనరించిన యీద్రోహమునకు నీకెట్టి శిక్షవిధింపవలెనో నాకుఁదోచకున్నది (కుమతికిమరణదండనవిధించి నట్లొకకాగితముపై వ్రాసి, కాగితమునుసుమతిచేతికిచ్చి) సుమతీ! ఈతీర్పునుసభికుల సమక్షమునఁగుమతికి వినిపి పుము.

సుమతి- (దానినందుకొని) శ్రీ శ్రీ ధర్మపాలమహీపాలునిచే, కుమతి యను మంత్రి రాజపుత్రునిఁజంపఁబూనినట్లు, కుమతిచే నతని కాంత రంగిక మిత్రుఁడగు వక్రబుద్ధియను సేనాధిపతికి వ్రాయఁబడిన యుత్తరముచే నిరూపింపఁబడుటచే కుమతికి మరణదండన విధింపఁ బడినది.

కుమతి (తనలో) "తానొకటి దలఁచిన దైవమొకటి దలఁచునన్నట్లు" నే నెంతజాగ్రతగఁ బ్రవర్తించినను, దైవప్రాతికూల్యంబునఁజేసి నేఁజేసిన నేరము బయల్పడినది. "తాఁద్రవ్విన గోతిలోఁ తానేపడు నన్నట్లు" నా మరణముఁ జేతులార నే నే కొని తెచ్చుకొంటినే?

ధర్మ- ఎవరురా. అక్కడ?

(ఇరువురు భటులుప్రవేశము)

భటు- దేవా! ఏమి శెలవు?

ధర్మ- ఈకుమతిఁగొనిపోయి వధ్యస్థానంబునఁ దలఁదీయింపుఁడు. ఇదిగో! నా యాజ్ఞాపత్రము నాతలారికిండు. (ఆజ్ఞాపత్రమునిచ్చి) పొండు. (భటులు కుమతితో నిష్క్రమింతురు)

ధర్మ-(జయసేనునితో) ధీరపురుషా! మీ ముఖలక్షణంబులును; వాగ్వైఖరియుఁ దిలకింప మీరు క్షత్రియాన్వయ సంజాతులరనినాకుఁ దోచెడిని. కుమతికాంతరంగిక మిత్రుఁడును, సార్థకనాముఁడునునగు వక్రబుద్ధిని నేఁడే సేనాధిపతి పదవినుండి తొలఁగించుచున్నాను. నిరప

రాధులరగు మిమ్ముఁ జెఱఁబెట్టిన నాయవిమర్శకత్వమును మన్నించి నాసేనలకధిపతిగా నుండుట కంగీకరింపుఁడు.

జయ- మీ యానతి శిరసావహించుచున్నాను.

ధర్మ- నేటికీ కొలువుఁ జాలింతమా?

జయ- చిత్తము. (తనలో) నామిత్రుఁడగు మతిమంతుని జాడ తెలియ దాయె. మారువేసమున నెందెందు నాకొఱకై తిరుగు చున్నాఁడో గదా! (అందరు నిష్క్రమింతురు)





# జయసేనవిజయము



## తృతీయాంకము



(ప్రథమరంగము అరణ్యప్రదేశము)

(ప్రవేశము మతిమంతుఁడు యోగివేసమున)

మతి- నిద్రాహారములన్నైన లెక్కసేయక నామిత్రుఁడగు జయసేనునికై యెల్లెడల వెదకుచుంటిని. అతఁడెందుఁగానఁగాఁడాయె (కొంతవడియోజించి, విచారముతో)

చ॥ అనుపమ భోగభాగ్యముల కాస్పదమైననృపాలునింట తా
జననమునొంది సర్వవిధసౌఖ్యములాదియు నిప్పుడక్కటా
త్మనికతనన్ సమ సనుఖముల్ విడనాడియుఁ బ్రాణభీతిఁ గా
ననములసంచరించు నృపనందనుఁ గూర్చి విచారమందెదన్।

నృపనందనుని మాటటుండ నాతండ్రి విషయముఁ దలఁచుచో నా డెందంబున జనించు విచారమునకు మేరయుండదు.

(ఆలోచనమభినయించుచు) నా జనకుని మాటటుండ,

సీ॥ దేహిభూపాయన్న దేహమైనను కోసి
దానమొసంగెడి ధార్మికుండు
సద్ధర్మరతులైన జనుల బాధించెడి

క్రూరుల దండించు ధీరవరుఁడు
శత్రువైనను వచ్చి శరణన్నచో వాని
భీతిని బాపు పృథ్వీశవరుఁడు
అన్యకాంతలు తల్లులౌదురంచు దలంచి
సతతంబు వర్తించు సచ్చరిత్రుఁ
తే॥ డొక్కఁడే పెక్కు యోధుల నుక్కడించి
విజయలక్ష్మిని చేపట్టు వీరవరుఁడు
చంద్రసేనుఁడు తనదగు సంపదలను
కోలుపోయి వనంబునఁ గుందవలసె.

కానిమూర్ఖరక విచారించినఁ బ్రయోజనంబేమి ? శక్తివంచన లేకుండ యెల్లెడలఁ జంద్రసేనునికై వెదకెదఁగాక ! భయంకరారణ్య మధ్యమున భటులచే ప్రాణములతో నా భూపాలుఁడు విడువఁబడె ననియే గదా కాళికాలయమున వింటిని కావున నీయరణ్యమున నా మహీధవునికై వెదకెదఁగాక ! (నిష్క్రమించును).

ద్వితీయ రంగము : అరణ్యప్రదేశము

(ప్రవేశము చంద్రసేనుఁడు)

చంద్ర- ఔరా! కాల మహిమ! హాయిగనిగురఁబోవు నేను మేల్కాంచు సరికి శరభ మదేభసింహ మృగస కుల బును, కంటకశిలావృతంబును; అతి భీకరంబు నగు, నరణ్యమధ్య బున భటుల నిశితకరవాలంబుల కెఱఁగాఁ బోవుచుంటిని. భటులు నాయందలి విశ్వాసముచే విడచి పుచ్చుటఁబట్టి గాని లేకున్న నే నీవరకే యమలోకంబున కరిగి యుందునుఁ గదా !

మ॥ సకలోర్వీశులు భక్తిమైఁ గొలువ సచ్ఛౌర్యంబుఁ దీపింపఁగా
సకలామ్నాయ రహస్యవేదినయి భూచక్రంబుఁ బాలించు నే
నకటా ! సింహ మదేభ క్రూరమృగ తీవ్రారణ్య నిధ్వాన భా
రకబృందం బిటు గొల్వ ఘోరవన సామ్రాజ్యంబునన్ జేరితిన్ !
(వినుట నభినయించి) ఆ దెసనుండి బాలుని రోదన మొందు వినవచ్చు

చున్నది. ఆ దెసకేగి యా బాలునిఁ గాపాడవలెఁగాక! (నిష్క్రమించి; ప్రద్యోతనునితో మరల ప్రవేశించును)

చంద్ర- బాలకా! నీ తలిదండ్రుల పేరేమి?

ప్రద్యో- నా తండ్రిపేరు ధర్మపాలుఁడు; తల్లిపేరు హేమలత.

చంద్ర- మణిప్రస్థపురాధీశ్వరుఁడగు ధర్మపాలుని పుత్రుఁడవా? నీ వీ భటులచే యీ ఘోరారణ్యమున కెట్లు దోడ్కొని రాఁబడితివి?

ప్రద్యో- మా పెత్రియగు కుసుతియింట నాడుకొనుచుండగా యీ భటులు వచ్చి నా నాసికయొద్ద నేదియో యుంచిరి. తోడనే నిదుర వచ్చినది. మేల్కాంచుసరికి యరణ్యమధ్యమున భటులు నన్ను జంపఁబోవు చుండిరి. వెంటనే బిగ్గరగా యేడ్చితిని. మీరు వచ్చి నన్ను రక్షించితిరి.

చంద్ర- నీ జనకుఁడగు ధర్మపాలునకు నిన్నొప్పగించెద రమ్ము. నీకై నీ తలిదండ్రు లెంతేఁగా విలపించు చున్నారోఁగదా! (ఇరువురు నిష్క్రమింతురు)

తృతీయ రంగము : ధర్మపాలుని సౌధము

(ప్రవేశము ధర్మపాలుఁడు: హేమలత)

ధర్మ- ప్రేయసీ! ఎన్నిదినంబు లిట్లన్నపానంబులు వర్జించి సుతునికై బెంగఁబెట్టుకొని జీవింపఁగలవు?

హేమ- నాథా! నవమాసములు మోసి కని పెంచిన కుమారుఁడు గతించిన యనంతరము నే జీవించియుఁ బ్రయోజనమేమి?

చ॥ తనయుఁడె పాపనీరధిని దాటఁగ నావయటంచ్రు కోవిదుల్
తనయుఁడె సౌఖ్యసస్యవసుధాహిమధాముఁడు ఖేదమేఘముల్
మనముపఁ బాయఁజేయు వర మారుత మా తనయుండె ధాత్రిపై
తనయుఁడు లేనిచోఁ గలుగు తాప మపారముఁగాదె భూవరా॥

ధర్మ- ఔను. (ఎదుటఁజూచి) అదిగో! మన ప్రభావతి యిటే వచ్చు చున్నది. మొగమునఁ జింతఁ దోచనీయకుము. నీవు చింతించుచున్నట్లు గ్రహించిన నదియు దుఃఖింపఁగలదు. (ప్రవేశము ప్రభావతి)

ధర్మ- కుమారీ! పుత్రుఁడవైనను; పుత్రికవైనను నీవె గాన సర్వ లక్షణ లక్షితుఁడగు రాకుమారున కునిన్నిచ్చి పరిణయంబుఁ గావింప నెంచితిని

ప్రభా- జనకా! నా హృదయంబును హరించిన మోహనాకారుని నే నేల వివాహమాడకుందును.

ధర్మ- కుమారీ! నీహృదయమును హరించిన దెవరు?

ప్రభా- తండ్రీ!

చ॥ మనమున రోసమూనకయు మామకవాక్కుల నాదరించి యా
ఘనమతి నిర్ధనుండయిన కష్టములందుచునున్న నీచవృ
త్తిని జరియించుచుండిన మదీయ మనోహరుఁ జేరి శీఘ్రమే
వినయముమీర వానిఁ బిలిపించియుఁ బెండిలిఁ జేయుఁగావలెన్॥

హేమ- కుమారీ! ఇచటఁ గొన్ని రాకుమారుల చిత్రపటంబులుఁ గలవు. వీనిఁ బరిశీలించి, యిం దే రాకుమారుని చిత్రపటము నీ మదికి నచ్చునో వానినే వరింపుము. (ఒక పటముఁదీసి)

చ॥ వినుమిటు యీతఁడే మగధవిభుఁడు సర్వకళాప్రపూర్ణుఁడై
ఘనరిపు మత్తదంతిగణ కంఠవిలుంఠన సింహరాజమై
ఘనకవిపోషకుండు నయి కావ్యసుధారసపాన మత్తుఁడై
తనివరియింప సౌఖ్యములఁ దన్వయు నొందెదవమ్మ పుత్రికా॥

(ప్రభావతివిముఖత్వమును సూచించును)

ధర్మ- కుమారీ! ఇటుఁ జూడుము.

ఉ॥ కాశిపురాధినాథుఁడు వికస్వరపంచశరాభకాయుఁడై
భాసిలు సంతతంబు హరిపాదసరోజము లాశ్రయించియున్
భూసురపోషకుండగుచు పుణ్యగుణంబుల కాలవాలమై
నీ సరివారు లేరనుచు నిత్యము నెల్లరు సన్నుతింపఁగన్॥

(ప్రభావతి మరల విముఖత్వమును సూచించును)

హేమ- ప్రభావతీ! ఈ పటంబునఁ జిత్రింపఁబడియున్న లాటదేశాధీశునిఁ గాంచితివా? రూపయౌవన సంపన్నుఁడేకాని విద్య నెఱుంగని యవివేకి; యౌవన గర్వాంధుఁడయి, పిన్నపెద్దల తారతమ్య

మెఱుఁగక, ధర్మాధర్మంబులఁ బాటింపక, యిచ్చవచ్చినట్లు మెలఁగు చుండును. రూపమే ప్రధానముగ నెంతు వేని యీతఁడును వరింపఁ దగినవాఁడే.

ధర్మ- విద్యయన నెట్టిదో యెఱుఁగని మూర్ఖుని వరింపుమని పుత్రికకుఁ జెప్పుచుంటివా ?

ప్రభా- జనకా ! తరువాతనున్న పట మెవరిది ?

ధర్మ- కుమారీ ! ఇ ద్యది సింహపురేశుఁడగు రాఘవవర్మది. ఈతఁడు కొంచెముగా వయసు ముదిరినవాఁడన్నమాటే గాని పరాక్రమవంతుఁడు సుందరుఁడు. నాకు మేనల్లుఁడు నీ వీతనిని వరించితి వేని సుఖంబు లందఁగలవు.

(ప్రవేశము కేశవశాస్త్రి)

కేశ- (సంతృప్తితో) తథాస్తు! తథాస్తు. రాజా ! నీ కుమారి కా రాఘవ వర్మయే మగఁడగుఁగాక !

ధర్మ- బ్రాహ్మణోత్తమా ! మీ రాక యెచ్చటినుండి? మీ రిట్లు దీవింపఁ గారణం బేమి ?

కేశ (పత్రి నర్పించుచు) రాజా ! నీ మేనల్లుఁడగు రాఘవవర్మ పంపఁగా వచ్చితిని. తమ కుమార్తెయగు ప్రభావతి నా రాఘవవర్మ గారి కిచ్చి పరిణయ మొనర్పుఁడని మిమ్ముఁ బ్రార్థించుటకై యరుదెంచితిని. మిమ్మెన్నివిధములనో ప్రార్థింపుఁడని మా నరపతియగు రాఘవవర్మ గారు పలుమారుఁ జెప్పినారు.

ధర్మ- బ్రాహ్మణోత్తమా ! మీ రా యాసనము నధిష్ఠింపుఁడు. (ప్రభావతిఁ జూపుచు) ఈమెయే నా ప్రియకుమారి. ప్రభావతి. ఆమె కా రాఘవవర్మను వరింపుమనియే నేఁ జెప్పుచుంటిని. మీరుఁ జెప్పి చూడుఁడు.

కేశ- (సంతృప్తితో) రాజకుమారీ! రాఘవవర్మగారు కొంచెముగా వయసు ముదిరినవారన్నమాటేఁ గాని; రూపము విద్య మొదలగు విషయము లందు నీకుఁ దగినవారే. కావున నీ వా ధరణీశ్వరుని వరించి; పార్వతీ

పరమేశ్వరులవలె మీ రిరువు రనుకూల దాంపత్యముతో పెక్కు-
వత్సరములు వర్ధిల్లుఁడు.

ప్రభా- (తనలో) అభిమానమనునది యెంతవారికైనఁ జెడుఁద్రోవ
కీడ్చుఁగదా! ఈతఁడు "వృద్ధుఁడయ్యు నీకుఁ దగినవాడే"నని చెప్పు
చున్నాడు. వృద్ధునకు వివాహమేల నని తలఁపఁడాయనే!

కేశ- (నత్తితో) రాజకుమారీ! నే నబద్ధమాడువాఁడఁగాను. (యజ్ఞోప
వీతముఁ బట్టుకొని) గాయత్రిసాక్షిగ వచింపుచుంటిని. ఆ రాఘవ
వర్మగా రన్నిట నీకుఁ దగినవారే!

ప్రభా- భూసురేంద్రా! అతఁడు నాకుఁ దగినవాఁడేనని చెప్పుటకు సాహ
సింపకుఁడు నా తలిదండ్రులు నన్నాతని కీయ నెంచినను, నా హృద
యము మాత్ర మా వృద్ధునిఁ బెండ్లాడుటకు సమ్మతింపకున్నది.
కావున నే నా ముదుసలిఁ బెండ్లాడుదునని కలనైనఁ దలఁపకుఁడు.

కేశ- ధర్మపాల మహీపాలా! నీ కుమార్తె మా రాజుగారిని వృద్ధుఁడని
మెచ్చకున్నదే!

ధర్మ కుమారీ! రాఘవవర్మ ముసలియని శంకింపకుము. అతఁడన్యుఁ
డుఁగాడు. నా మేనల్లుఁడే. అతఁడు ప్రథమ కళత్రవియో
గము నందినప్పుడే నిన్నాతనికిఁ బరిణయఁబొనర్ప నెంచియుఁ బసి
దానవగుట యూరకుంటిని. మఱల తరుణము లభించినది. కావున
నా మాట లాలించి యా రాఘవవర్మఁ బెండ్లాడుము. అతఁ డెంతటి
గుణవంతుఁ డనుకొంటివి?

తే॥ పరధనమ్మును విషమట్ల బ్రాహ్మణులను
సురలపోల్కి-నిఁ జూచు భూసురశిఖీంద్రు
లఁ గరుణించి యిచ్చు ధనము లధికముగను
అతను జితయాపుఁడౌ రాఘవార్యుఁడబల.

ప్రభా- తండ్రీ! అతఁ డెంత గుణవంతుఁడైన వృద్ధుఁడే గదా!

మ॥ అరయఁగా వృద్ధులు కన్యలఁగనియు మోహంబొంది పెండ్లాడుటల్
ధరణిఁగా కోటికి నారికేళఫల మా ప్రాప్తంబైన మార్గంబె యౌా

హరిపై నిల్వదు మానసంబు హరిమధ్యల్ గాంచరీ వృద్ధునిన్
ధర నీ రీతిగ నందు నిందుఁ జెడు నాతం డిట్లు తా భ్రష్టుఁడై॥

అదియునుఁగాక, రూప, వివేక, శీల, గుణ సంపన్నత్వంబున సమానులగు వధూవరులకుఁ గావించునదియే పెండ్లి గాని; వధువు వలదన్న కొలఁదిని కాటికిఁ గాళ్ళుఁ జాచుకొనియున్న యొక వృద్ధునకు నవవయోవిలాసవతి నంటగట్టుటయుఁ బెండ్లి యగునా ?

మ॥ సతికంఠంబునఁ బూరుషుండు సుజనుల్ శ్లాఘించి దీవింప న
త్యతిమోదంబున వ్రేలఁజేయు శుభసూత్రం బాపయిన్ దుష్టుఁడై
పతిసాధ్విన్ గనకున్నఁ బ్రేమమెయి నప్పద్మాక్షి కా సూత్ర మా
యతమై తా నురిత్రాడుగా బరగునయ్యా భూమిదేవోత్తమా॥

కేశ- (తనలో) ప్రాయమునఁ జిన్నదైనను జ్ఞానమున నాకన్న మిన్నయే యీ కన్నమిన్న.

ధర్మ- కుమారీ! నాయాజ్ఞ కన్యథా ప్రవర్తింపనెంచితివా? రాఘవర్మఁ బెండ్లాడవా?

ప్రభా- తండ్రీ! చేతులార నీ కన్నకుమారి తనొక మృత్యుముఖవృద్ధున కిచ్చి వివాహమొనర్చుటకు నీయంతరాత్మయెట్లంగీకరించుచున్నది? మీనల్లుఁడుఁగాన వృద్ధుఁడైనఁ బరిణయఁ బాడమందువా? త్రికరణశుద్ధిగా నొకనిని వరించి; వానిని వదలి వేఱొకనిఁ బెండాడుట మారుమను వనఁబడదా. అట్టిదికీర్తి కాములకుఁ దగునా?

హేమ- కుమారీ! త్రికరణశుద్ధిగానీ వెవనిని వరించితివి?

ప్రభా- తల్లీ! నాహృదయాబ్జపీఠమునలంకరించిన మోహనాకారుఁడు కాంచన పురాధీశునిపుత్రుఁడగు జయసేనరాకుమారుఁడే.అతనిచిత్రపటమునునీవుఁ జూచితివికదా!(ధర్మపాలుని దిక్కు మొగంబై)తండ్రీ! నీవునుయెఱుఁగుదువుగదా! అతని సౌందర్యము మీరుమాత్రమె ఱుఁగనిదేమున్నది ?

ధర్మ- ఏమీ! పినతండ్రి నదిరింపఁజాలక, సర్వసంపద లాతని కై వసఁ బొనర్చి యసువుల దక్కించుకొననెంచి స్వదేశమును వీడి; నట్టడవులపాలై యెట్లొటో కాలముఁ బుచ్చుచున్న పిఱికి జయసేనుఁడా

నీ హృదయమును హరించినది. చాలు. చాలు. నీ వైరియూహాలఁ గట్టిపెట్టి సింహపురేశుఁడగు రాఘవవర్మనే వరింపుము.

ప్రభా- (తనలో) జయసేన రాకుమారుఁడు రాజ్యముఁ గోల్పోయి యందందు దిరుగుచున్నాడని నా తండ్రికిఁ దెలియవచ్చినదే! చారుల మూలమునఁ దెలిసికొనెనేమో? (ప్రకాశముగా) తండ్రీ! జయసేన రాకుమారునియందు లగ్నమైయున్న నా హృదయమా మదనసలిఁ బొంద్దాడుట కై తమాత్ర మంగీకరించుట లేదు

ధర్మ (తనలో) ఈమెఁ గొంతవడి బెదరించి చూచెదఁగాక! (ప్రకాశముగా) కుమారీ! నే నింతగాఁ జెప్పినను వినవైతివి. ఇఁక నీ యిష్టముతో నాకుఁ బనిలేదు. నే నెట్టియున నిన్నాతనికిఁ బరిణయంబొనర్పక మానను.

ప్రభా- తండ్రీ! మీ కింత పట్టుదల యేల? నా ప్రేమ సామ్రాజ్యమున స్వేచ్ఛావీథిని విహరింప నాకు నధికారము లేదా! కన్యకు సరియైన మగఁడు లభింపకున్నఁ గన్యయుఁ గట్టుబడు పశువుఁ ద్రాడిల్లాడుగఁ బరిగణింపఁబడునే అట్టి వివాహమున నా ప్రేమనిధి నన్నుఁ గొనుటలో నాయిష్ట ముండవలదా? వేయేల. విద్యావతినై వివేకవతినై, నవవయోవిలాసినినగు నాకు, నా భర్త నన్నుఁ గొనుటలో నా యిష్టము దక్క మీ యిష్టముతో నాకుఁ బనిలేదు

చ॥ వలగటు జేయఁగావలసి భావ్యము గాఁదటుజేయుటంచు నేఁ
బలుకుచునుండ మీరు బలవంతముగా నొనరింతు రేని నే
జలమున మున్గి యైన మఱి విసబును మెక్కియొ నా మనోహరుఁ
దలఁచుచుఁ బల్కి లోకమునఁ దప్పక చేరుట సత్యమౌ నృపా॥

ధర్మ- (తనలో) ఈ కన్నియ దృఢనిశ్చయురాలై యున్నది. బలవంతముగా నీ కనాతని కిచ్చి, తరువాత యీమె యాత్మహత్యఁ గావించుకొనినచో, పోయినకొడుకుఁ బోవ, యీమెకై గూడ బ్రతికినన్నాళ్ళు దుఃఖపడనేల? (ప్రకాశముగా) శాస్త్రిగారూ! ఈమెకు నేఁ జెప్పఁగలవంతయుఁ జెప్పితిని వినకున్నది. ఇంతకన్న నా ప్రియకుమారితకు బోధింపఁజాలమికి నన్ను క్షమింపుఁడు.

కేశ- లేచి, (నత్రితో) నేను క్షమించుటకేమిగాని! మీ మేనల్లుఁడు మాత్రము మిమ్ము క్షమింపఁడు. బుద్ధిపూర్వకముగ మీరీ కన్నియ నీయ లేని, యుద్ధమున మిమ్మోడించి శ్రీకృష్ణుఁడు రుక్మిణిఁ గొని పోయినట్లు లా నరపతి మీ కుమారితఁ గొనిపోయి వివాహ మాడునట.

ధర్మ- (ఆగ్రహముతో) "ఈ ధర్మపాలుఁ డవక్రపరాక్రమంబున ధారుణీ చక్రముఁ బరిపాలించుచున్నాఁడు కాని కాంతకరణికరములకు గాజులఁ దొడిగించుకొని యొక మూల నొదిగియుండలేదని వచింపుము ఆతఁ డంతటి పౌరుషవంతుఁడైన నట్టే యొనరింపుమనుము. చేతు లారి నీ కన్నె నా ముదుసలికిఁ గూర్పఁజాలనని చెప్పుము. పొమ్ము.

కేశ- రాజేంద్రా! నీ మేనల్లునితో నట్లే వచించెద లెమ్ము.

(అందరు నిష్క్రమింతురు)

(పునఃప్రవేశము: కేశవశాస్త్రి)

కేశ- రాఘవేశ్వరుఁడు చెప్పుమని దంతయుఁ బూసఁ గ్రుచ్చినట్లుఁ జెప్పితిని. కాని ప్రభావతి యా నరపతిఁ బెండ్లాడుట కంగీకరింపదాయె రాఘవేశ్వరుఁడు తప్పక యా ప్రభావతిఁ బెండ్లాడు నుపాయ మెద్ది? (యోజించి) "కొండఁద్రవ్వి యెలుకఁబట్టినట్లు" కన్నియకై వేల కొలఁది సైనికుల నష్టపఱచికొని యీ రాఘవేంద్రుఁ డీధర్మపాలునిపై యుద్ధమునకు రానేల? మాయోపాయమున నా ప్రభావతిని సింహ పురంబునకుఁ జేర్పించి యామెఁ బెండ్లాడుమని మా రాజుగారికిఁ జెప్పెద గాక! (నిష్క్రమించును)

(ప్రవేశము మల్లిక)

మల్లిక- నేటియుదయమునుండియు రాజకుమారియగు ప్రభావతి యంతః పురంబున నెచ్చటఁ గాన్పించుటలేదు. ఆమెకై ధర్మపాల మహీ పాలుఁడును, రాణిగారును మిగుల వగఁ జెందుచున్నారు. "గోరు చుట్టుపై రోకటిపోట"న్నట్లు సుకుమారాకారుఁడగు కుమారునికై చింతించుచున్న రాజదంపతుల కీ కుమారీ వియోగము సహింప రానిది గదా! (యోజించి) వివాహ మాడనని నొక్కి వక్కా

శించుటచే నాగ్రహించి సింహపురాధీశుఁడగు రాఘవవర్మనే మాయోపాయమున ప్రభావతిఁ గొనిపోయి యుండును. అతఁడామెను “తన్ను వివాహ మాడుమని” బలాత్కరించునేమో ఎంతగా బలాత్కరించినను ప్రభావతి యా ముదుసలిఁ బెండ్లాడునా? దైవ నిర్ణయ మెట్లున్నదో! నే నిదే కాళికాలయమునకుఁబోయి సురక్షితముగఁ ప్రభావతి నిలుఁజేర్పుమని యా జగజ్జననిఁ బ్రార్థించెదఁగాక!

(నిష్క్రమించును)

(ఇదివిష్కంభము)







# జయసేన విజయము



## చతుర్థాంకము



ప్రథమరంగము ప్రభావతీ సౌధము

(ప్రవేశము ప్రభావతి విచారముతో)

ప్రభా- (విచారముతో) కట్టా! నేనీ యంధకార బంధురమగు గది లోని కట్లు కొనిరాఁబడితిని. (యోజించి) నేను వివాహమాడనని ధిక్కరించుటచేఁ గోపించి రాఘవవర్మయే నన్నిందుఁ జేర్పించి యుండదుగదా!

(ప్రవేశము రాఘవవర్మ)

రాఘ- (తనలో) భటుల న[illegible] నుమరేయిని రహస్యముగా ప్రభావతి నిలకుఁ జేర్పించితిని. ఇఁక నీమెకు నా మనోభిప్రాయం బెఱిఁగించెదఁ గాక! (ప్రకాశము) సుందరీ! భటులనంపి నను రేయిని రహస్యముగ నిన్నిందుఁ జేర్పించిన రాఘవవర్మ యిదే నీ యెదుట నిలువఁబడి మదనసామ్రాజ్య పట్టాభిషిక్తునిఁ "గావింపుమని" కేల్మోడ్చి ప్రార్థించుచున్నాడు.

ప్రభా-(తనలో) నే ననుకొనినంత జరిగినది. (ప్రకాశముగా) ఛీ! క్షత్రియకుల కళంకా! మతిహీనా! ఎంతటి కానికార్యమున కొడిఁగట్టితివిఁ

అన్నపానంబులు వర్జించి, కృశించి, నా ప్రాణములనైన నీ కర్పింతునుగాని, నా హృదయమును నీ కర్పింపఁజాల.

రాఘు- కోమలీ! నాపై నీకింత కోపమేల?

మ॥ ధనమా లోపము లేదు ధైర్యముగ నేత్రదాజ్యమ్ముఁ జేయుటల్ ?
జనకుండుండమి నాకు నింట మన యిచ్ఛారీతి వర్తింపఁగా
జను నా కన్యసతీమణుల్ గలుఁగవిఁక స్వాంతంబుఁ నిన్నె ప్రే
మనుజాతుఁ ననునాకు రాజ్యముచు కొమ్మాయేలుకొమ్మాయికన్॥

ప్రభా- ఛీ కలుషాత్మా! "వినాశకాలే విపరీతబుద్ధిః" అన్నట్లు లీ బుద్ధి నీయంతమునకే జనించినట్లున్నది.

రాఘు- మోహనాంగీ! నీ వెంతగా నిందించినను, నీ దూషణవాక్యము లన్నియు నాశీర్వచనములుగ శిరసా వహించెద.

సీ॥ నీదు కౌగిలిలోన నీఁగాలాడుచున్న
నిద్రత్వమదియేల యింకవదన
మధురమై యొప్పు నీ యధరామృతముఁ గ్రోల
షడ్రసాన్నమ దేల? జలజగంధి
కోర్కెమై చెక్కిళుల్ గొని ముద్దులడుచున్న
రాజ్యసంపద లేల? రమణిమిన్న
నినుఁగూడి మనకేళి నెఱయుచో దివిజ వే
శ్యల పొందదేలనే సన్నుతాంగి

తే॥ గీ॥ నిన్నుఁ బెండ్లాడి సుఖముల నెఱయనేని
నాకు తనువేల? ధనమేల? నాతిమిన్న
మదనతాపాగ్నిలోఁబడి ప్రమగ్గుచుంటి
నధరసుధ నిచ్చి రక్షింపు మంబుజాక్షీ!

(అనుచుఁ జేరవచ్చును)

ప్రభా- ఈతఁడు నామాటలఁ బాటింపక నన్ను బలాత్కరించునని తోచుచున్నది. కావున నేదేని కపటోపాయమున నీతని బారినుండి తప్పించుకొని పోవలయును. (ప్రకాశముగా) రాజా! నీ వెంతటి యమాయకుఁడవు? నీ చిత్తమును పరీక్షించుటకై నీపై నాకనురాగము లేనట్లు

నటించితినేగాని నిజముగా నీపై ప్రేమ లేనిదానఁ గాను. కాని మీకును నాపై ప్రేమ గలదనుటకు నిదర్శనముగ నే నడుగదలఁచిన దానిఁ గాదనక యొసఁగవలయు.

రాఘు- సుకుమారగాత్రీ! నీ వడుగుటయు, నేఁ గాదనుటయునా? నాప్రాణములనైన నీకై విడనాడువాడ. నీ కేమి కావలయునో కోరుకొనుము.

ప్రభా- రాజేంద్రా! మఱేమియుఁగాదు. తమ వ్రేలఁ ధరించియున్న రతనంపు టుంగ్రము నొసంగుడు. ఒక ముహూర్త కాలములో దానిఁ దిరిగి మీ కొసఁగెద.

రాఘు- తిరిగి యొసఁగకున్న నేమి? ఇదిగో తీసికొనుము. (తన వ్రేలి యుంగిరము నామె కొసంగును)

(తెఱలో, జనకా! జనకా!)

రాఘు సుందరీ! నా తనయుఁ డిచ్చటికి వచ్చుచున్నట్లున్నాడు. వాఁ డిటకు రానేల? నేనే వానితో సంభాషించి వచ్చెద. నీ విందే యుండుము. (రాఘువవర్మ నిష్క్రమించును)

ప్రభా- (సంతోషముతో) ఇప్పటికీ వృద్ధ పిశాచము నాయెదుటి నుండి తొలఁగిపోయినది. జాగొనరింపక నే నీ యుంగరమును దౌవారికున కానవాలుఁగఁ జూపి యిచ్చోటనుండి తప్పించుకొని పోయి నా తలిదండ్రులఁ జేరెదఁగాక! జాగొనరించిన రాఘువవర్మ మఱల యిచ్చటి కరుదెంచును. కావునఁ బోయెదఁగాక!

(నిష్క్రమించును)

(రాఘువవర్మ ప్రవేశము)

రాఘు- ప్రభావతీ! ప్రభావతీ! ఇందేగదా! యామెనుంచి నే లోనికిఁ బోయితిని. నే వచ్చుట కాలస్యమైనదని నాపైఁ గోపించి యొందైన దాగియున్నదేమో? వెదకెదఁగాక! (నలుమూలలఁ బరికించి) ఎందుఁ గానరాదే! ఎవఁడురా అక్కడ!

(దౌవారికుఁడు: ప్రవేశము)

రాఘు- దౌవారికా! రాకన్నియయొక్క తె నీకేమైనఁ జెప్పి తప్పించుకొని పోయెనా.

దౌవా- దేవా! నేద్వారమునఁగాచియుండ చక్కనికన్యయరుదెంచి తమ ప్రేలియుంగరము నానవాలుగఁ జూపి యుత్యావసరముగఁ బోవలయు నని చెప్పి వెడలిపోయెను.

రాఘు- సరే! నీవుఁబోయి ద్వారమునఁగాచియుండుము పొమ్ము.

రాఘు- ఔరా! ఎంతటి వింత! (దౌవారికుఁడు నిష్క్రమించును)

తే॥ గీ॥ ఇందెయుండును పొమ్మంచు సుందరాంగి
చెప్పివాతోడ యిట్లువంచించిపోయె
వనితలనునమ్మరాదను వాక్యమిపుడు
తేటపడెఁ గృటిలోనని బోటివలన.

(ప్రవేశము దౌవారికుఁడు)

దౌవా- దేవా! వాకిట నెవరోయోగి తమదర్శనార్థమై వేచియున్నాఁడు. దేవరవారిసెలవగునేని లోనికిఁ బంపెద.

రాఘు- ప్రవేశపెట్టుము.

మతి- (యోగివేసమునఁ బ్రవేశించి, తనలో) చంద్రసేన, జయసేనులకై యెల్లడల వెదకి నేటికీ సింహపురంబున కరుదెంచితిని. ఈ పురాధీశ్వరుని యాస్థానమున వారిలో నొకరేనిఁ బ్రచ్ఛన్నవేసమునమెలఁగు చుండిరేమోయను తలంపున నిచ్చటి కరుదెంచితిని. (రాఘువర్మను సమీపించును)

రాఘు- యోగీంద్రా! సింహపురాధీశ్వరుండగు రాఘువర్మయిదే నమస్కరించుచున్నాఁడు. (నమస్కరించును)

మతి- శుభమగుఁగాక! రాజా! కళావిహీనమైయొప్పు నీవదనారవిందముఁజూడ విషాదమేమర హృదయుండవైయున్నట్లునాకుఁదోచెడిని. నీవిట్లుండుటకుఁ గారణంబేమి?

రాఘు- దేనికైనా ప్రాణములనైన సమర్పింపఁ దలంచితినో, అట్టిలావణ్య
రాశినన్ను వంచించిపోవుటయే నాదుఃఖమునకుఁ గారణము.

మతి- ఆలావణ్యరాశి యెవరో వివరముగఁ జెప్పవైతివే?

రాఘు- యోగీంద్రా! ఆమెయెవరోగాదు. నామేనమామయు మణిప్రస్థ పురాధీశుఁడునగు ధర్మపాలమహీపాలుని కుమారిక. ఆకన్నియ, రాజ్యమునుఁ గోల్పోయి యుండుటకుఁదిరుగుచున్న కాంచన పురాధీశుని కుమారుఁడగు జయసేనుఁడను వానినివరించినదట. నేనా కన్నియఁ బెండ్లాడఁదలఁచి మాయోపాయమున నామెనింటఁ జేర్పించి నన్నుఁ బెండ్లాడుమని బోధించితిని. ఆమెతొలుత నాకోర్కెనంగీకరింపక యెట్టకేలకు నాపైననురాగముఁ గలదివోలె నటించినన్నువంచించి పాఱిపోయెను

మతి- (తనలో) ఇచ్చోటికి వచ్చుటవలన మణిప్రస్థపురాధినాథుని పుత్రిక నా మిత్రుఁడగు జయసేనుని వరించినది తెలిసినది. జయసేనుఁడా పురంబుననే యుండిన నుండవచ్చు. (ప్రకాశముగా) రాజా నీకేమైన సంతానముగలదా?

రాఘు- యుక్తవయస్కుఁడైన తనయుఁడొకఁడుఁ గలఁడు.

మతి- అట్లైన

మ॥ జనవర్గంబానరించు తప్పులకు నిచ్చల్ వారిశిక్షింపుచున్
ఘనుఁడీతండని మెచ్చఁగా సుజన సంఘం బెప్పుడున్ మించు నీ
వనుమానింపకయొక్క లేమకయి భావంబునఁ జింతింపఁగాఁ
జనునే మాయని మచ్చగాదెయిది నీ సత్కీర్తికిన్ భూవరా!

మదనతాపాగ్నికి సైపలేనంటివేని,

మ॥ వనజాతాస్త్రనిపూవు బాణములకీ శక్తిన్ విచారించుచో
వనజాతాప్తజుఁడుగ్రుఁడై మిగుల నొవ్విన్ జేయునవ్వేళ నీ
మన మేరీతిగ వంతఁగుందుననుచున్ బల్మారు యోజింపకే
వనితన్ జేరనిదానిఁ గోరివగవన్ భావ్యంబె ధాత్రీశ్వరా!

అదియునుఁ గాక;

మ॥ తనయుండుండెనటంటివే యతనికుద్వాహమ్ము గావించి నీ
తనయుండందెడు సౌఖ్యముల్ గనియు మోదంబందుటో లేక నీ
తనయుండేలఁగ రాజ్యముఁ ముదమునఁ దైత్యాంతకుఁ గొల్చుటో
జనునే గాక నృపాల పాపయుతమౌ సంసారమింకేటికిఁ॥

రాఘు- (లేచి, చేతులుజోడించి) మహాత్మా! మీయుపదేశమునఁ జేసి నామూర్ఖతయంతరించె. ఇఁక నెన్నఁడును బరాంగనల నీకరణి బాధింపను. అన్యకాంత లెల్లరుఁ దల్లులనుతలంపుచుఁ బ్రవర్తించెద. క్షమింపుఁడు. (పాదములపైఁ వ్రాలును)

మతి- (లేవదీసి) రాజా! నీవింతటనైన నీబుద్ధిని మరల్చుకొన్నందులకే నేంతయు సంతసించితిని. నేఁ జెప్పుచున్నాడ ధర్మమార్గానువర్తివై మెలఁగుము. (కొంచెముదూరముసడచి, తనలో) నామిత్రుఁడగు జయసేనుని మణిప్రస్థపురాధి నాథుని పుత్రిక వరించినదట కావున నాతఁడాపురముననే యుండనోపు. ఇప్పుడునే నప్పురంబునకు కేగి యాతనిఁగలసికొనెదఁగాక!

(నిష్క్రమించును)

## ద్వితీయరంగము అరణ్యప్రదేశము.

(ప్రవేశము జయసేనుఁడు ధనుర్ధరుఁడై)

జయ- నేఁడు మృగయావినోదక్రీడాభిలాషినై యరణ్యమధ్యమున కరుదెంచితిని. క్రూరమృగములనెన్నింటినో బరిమార్చితిని. కొంత తడవీ వృక్షచ్ఛాయఁ గూరుచుండి సేదఁ దీర్చుకొనెదఁగాక! (కూరుచుండును)

(తెఱలో) ఆర్తరక్షణబిరుదాంకితులగు క్షత్రియులఁ గంటిరా! నన్నీమృగరాజు బారినుండి రక్షించువారే లేరా?

జయ- (వినుట నభినయించి) కంఠస్వరము ననుసరించి చూడ నెవ్వరో యొక స్త్రీ యార్తురాలైయున్నటుఁ దోచెడిని. (బిగ్గఱగా)

తే॥ గీ॥ నాగళంబున నసువులున్నంత దనుక
నీకుహాని గలుగఁబోదు నిశ్చయముగ
సింహమును దన్మి నేసెదె శీఘ్రగతిని
నిన్నురక్షింపఁ గలవాఁడ సన్నుతాంగి।
(త్వరగా నిష్క్రమించును)

తృతీయరంగము- అరణ్యము
(ప్రవేశము ప్రభావతి)

ప్రభా- (భయమున భినయించుచుండును)
జయ- (ప్రవేశించి బాణమును విడచును. సింహము, బిగ్గఱగానఱచి మరణించును)

జయ. (ప్రభావతితో)

తే॥ గీ॥ నిరపరాధుల నేచెడి నీచు లెల్ల
రిల్లు మరణింతురంచు తానెల్లరకునుఁ
జెప్పఁదలఁచి స్వర్గమ్మునుఁ జేరెననఁగ
నసువులఁ బాసెమృగరాజు బిసరుహాక్షి.

ప్రభా- (జయసేనునిఁగాంచి)
చ॥ సురపతివో? రతీపతివొ? చుక్కలఱేనివొ? లేక మాధవో
హరుఁడవొ? పార్వతీపతివొ? అబ్జహితుఁడవొ వేల్పుఁ బెద్దవో
నరిగముహూర్త మాత్రమికజాగనునేని యకాలమృత్యుగ
హ్వరమునఁ జేరనున్న యసహాయనుఁగాచితి వీవుసత్కృపన్॥
జయ- ఉ॥ జవ్వనినీవుఁ బేర్కొనిన సారసబాంధవ శంకరాదులం
దెవ్వఁడఁగాను నావిషయమేర్పడఁ జెప్పెదఁగాని ముందుగా
నెవ్వరొ? తల్లిదండ్రులు మఱెవ్వరు సాయములేక యొంటిగా
నివ్వన సీమకీ విటులనేతెరఁగారణమేమొ చెప్పుమా॥

ప్రభా- ధీరపురుషా! మణిప్రస్థపురాధీశుఁడగు ధర్మపాల మహీపాలుని తనయను ప్రభావతియను దానను. సింహపురంబునుండి వచ్చు చుంటిని. కర్ణకఠోరముగ గర్జించుచు పైఁబడవచ్చు మృగరాజుఁ గాంచి భీతిచేఁ గేకవైచితిని. మీరరుదెంచి రక్షించితిరి.

జయ- సుందరీ! నేనెవరనుకొంటివి? సుభద్రఁ బరిణయంబాడ నేతెంచిన పాండవ మధ్యమునివలె యోగివేషమున నీ యుద్యానవనమునఁ బ్రవేశించి; నీతోఁ గొంతవడియుండు విహరించి తరువాత నీతండ్రిచేఁ గారాగారమున బంధింపఁబడిన

ప్రభా- (ఆశ్చర్యముతో) నిరపరాధులగు మిమ్ములనే నాతండ్రి కారాగారమున నుంచెనా? కట్టా! ఎంతటి విపరీతము జరిగెను? ప్రద్యోతనునిఁ జంపెనను నేరముపై నొక బైరాగి కారాగారమునను నుంచఁ బడినాడని నాతండ్రి నాకుఁ జెప్పినను, అట్లు శిక్షింపఁ బడినది మీరని గ్రహింపనైతిని. తరువాత మీరాచెఱనుండి యెట్లు విముక్తిఁ గాంచితిరి?

జయ- నీతమ్మునిఁ జంపించిన కుమతికిని తండ్రి మరణదండన విధించి; నాకు సేనానాయక పదవి నొసఁగెను, ఈ వృత్తాంతమును నీ తండ్రి నీకుఁ జెప్పలేదా?

ప్రభా- ఎప్పుడో యొకతూరి చెప్పినట్లున్నాడు. బాగుగా జ్ఞాపకము లేదు. (ఎదుటఁజూచి) మనోహరా! ఎవరో యోగీంద్రుఁ డిటు వచ్చుచున్నాడు.

(ప్రవేశము మతిమంతుఁడు యోగివేషమున)

జయ- యోగీంద్రా! చంద్రసేనమహీపాలుని కుమారుఁడగు జయసేనుఁ డిదే నమస్కరించుచున్నాడు.

మతి- (వారించుచు) మిత్రమా! జయసేన! ఈ మతిమంతునకు నిన్ గాంచు భాగ్యమెన్నాళ్ళకుఁ గలిగె? (జయసేనుని కౌఁగిలించుకొనును)

జయ- మాయవేషమున నున్నంతచే గుర్తింపనైతిని. మిత్రమా! నీ దేహ మింత శుష్కించినదేమి? నా కొఱకై నిద్రాహారములు మాని

పెదకుమంటివి గాఁబోలు. నాకై యొంత్రశ్రమ పడితివి? నీ ఋణమును నేను వేయి జన్మములకైనఁ దీర్పఁగల్గుదునా ?

మతి- జయసేనా ! కార్యసాఫల్యమును గాంచిన పూరుషుఁడు తన వ్యయప్రయాసల లెక్క సేయునా ? నిన్నుఁ గాంచినంతనే నా యలసట యంతయు మటుమాయ మయ్యెను. దుర్మదాంధుఁడగు నీ పినతండ్రి, నీ తండ్రి నరణ్యమధ్యమునఁ జంపఁ బంపించి, నా తండ్రిని చేతులార వధించెను.

జయ- కట్టా ! నీ తండ్రి నా కలుషాత్ముఁడు చేతులార వధించెనా ? ఎంతటిపాపకార్య మొనర్చెను ? నా తండ్రి యరణ్యమధ్యమున వధింపఁబడెనా ?

మతి- చంపఁబోయిన భటులుఁ రాజుగారిని విశ్వాసముచేతను; వృద్ధుఁడనుజాలిచేతను, చంపఁ జేతులు రాక నీ తండ్రి నరణ్యమధ్యమునఁ జంపక యే విడచివచ్చిరట.

జయ- శీఘ్రముగ నా తండ్రి వివరము కనుఁగొని, సత్వరమ్ముగ నేగి చండవర్మ మదం బడంపవలయు. ప్రకృతము నేను మణిప్రస్థ పురాధీశుఁడగు ధర్మపాల మహీపాలుని సేనల కధిపతిగా నుంటిని. ఈ కన్నియ యా నృపాలుని తనయ. ఈమె నా నరనాయకున కప్పగించి, వారియొద్ద సెలవుఁ గైకొని నా తండ్రిని వెదుకఁ బోవలయు. కావున నిప్పుడు మణిప్రస్థ పురంబునకుఁ బోవుదము.

(అందరు నిష్క్రమింతురు)

చతుర్థ రంగము: ధర్మపాలుని సౌధము
(ప్రవేశము : ధర్మపాలుఁడు)

ధర్మ- నా కుమార్తెను మృగరాజుబారినుండి రక్షించి యిటుఁ జేర్చిన నూతన సేనానాయకుఁడే కాంచనపురాధినాథుని పుత్రుఁడగు జయసేనుఁడని నా తనయ యగు ప్రభావతి వలనఁ దెలిసినది. మున్నొకపరి నా కందిన జయసేనుని చిత్రపటమునకును యీ యోధవరుని ముఖలక్షణంబులకుఁ దారతమ్యంబుఁ గాన్పింపకున్నది. ఇతఁడే యా జయసేనుఁ డనుట కేమాత్రమును సందియముఁ

దోఁచుట లేదు. ఈతనినే నా కుమారి మనసారఁ గోరియున్నది. ఇప్పుడతనిఁ దోడ్కొని రమ్మని భటునిఁ బంపితిని. (ఎదుటఁజూచి) అదుగో! జయసేనుఁడు వచ్చుచున్నాడు.

(ప్రవేశము : జయసేనుఁడు సేనానాయక వేషముతో)

జయ- రాజేంద్రా! నా నమస్కృతు లందుకొనుఁడు.

ధర్మ- శుభమగుఁగాక! ఇన్ని దినంబులనుండియు నిన్నొక సేవకుఁగా భావించుచు నా యాజ్ఞల నిర్వహింపఁ జేయుచుంటిని. నేటికి నీవు చంద్రసేన భూపాలుని కుమారుఁడవని తెలియవచ్చినది. కావున నీ యుదంతము నంతయుఁ దెలియఁజేయవలయును.

జయ- రాజా! మీ రన్నట్లు నేను చంద్రసేన భూపాలుని కుమారుఁడనే. జయసేనుఁడనువాఁడనే. కాలవశమున మీకడ తలదాచుకొంటిని.

ధర్మ- జయసేనా! నిన్నొక సేవకుఁగా భావించిన నా యవిమర్శకత్వమును మన్నింపుము.

జయ- అవిమర్శకత్వ మేమున్నది! మీ కర్తవ్యము మీరు నిర్వర్తించుకొంటిరి ?

(జయసేనుని చిత్రపటముతో ప్రభావతి ప్రవేశము)

ప్రభా- (ధర్మపాలునితో) తండ్రీ! చంద్రసేన భూపాలునిచే మాకు మన కంపఁబడిన చిత్రపట మిదిగో!

ధర్మ- (చిత్రపటము పరిశీలించి కుమారీ! నీ యభీష్టము నెరవేర్చెద. జయసేనా! ఈ చిత్రపటమునుఁ జూచినదాది యీమె నిన్నే త్రికరణశుద్ధిగాఁ బ్రేమించియున్నది. అట్లయినచోఁ బెండ్లాడి నా కోర్కెఁ దీర్పుము.

జయ- (సిగ్గుతో) ఇన్ని దినంబులనుండి మీ యాజ్ఞ జవదాటి యెఱుఁగని జయసేనుఁడీ యాజ్ఞనుల్లంఘించునా!

ధర్మ- (విచారముతో) కుమారీ! నీ వివాహ సమయమునకు నీ ముద్దుల సోదరుఁడు లేకపోయెఁగదా! (విచారము నభినయించును)

(ప్రవేశము దౌవారికుఁడు)

దౌవా- దేవా! జయము జయము.

ధర్మ- ఏమిరా! వి శేషములేమి?

దౌవా- దేవా యెవరోయొక వృద్ధుఁడు తమకుమారునితో వాకిట వేచి యున్నాఁడు.

ధర్మ- ఏమీ! నాకుమారునితోడనా? నా ముద్దులప్రద్యోతనుని తోడనా? సేవకా! ఇట్టిసంతోషవార్తఁ దెచ్చినందులకీహారమును బహుమానముగఁ గైకొని (మెడలోనిహారమును దీసియిచ్చి) వారిని సత్వరముగఁ బ్రవేశపెట్టుము. (సేవకుఁడు నిష్క్రమించును. చంద్రసేనుఁడు ప్రద్యోతనునితో ప్రవేశము)

ధర్మ- (సంతసము తో కుమారుని దగ్గఱకుఁ దీసికొని) కుమారా! నీవీ వృద్ధునిచే నెట్లు రక్షింపఁ బడితివి?

ప్రద్యో- నాన్నగారూ! సేనానాయకుఁడు మంత్రిగారింట నాకు కొనుచుండ; హఠాత్తుగ నలువురు భటులువచ్చి నా నాసికవద్దనేదియో ద్రావకమునుంచిరి వెంటనే నాకు నిదురవచ్చెను. నిద్రనుండి మేల్కొనునరికి అడవిలో నుంటిని. నలువురుభటులు నాచుట్టుఁ జేరినన్నుఁ జంపుటకుఁ గాఁబోలు కత్తులెత్తిరి. నే భయముచేఁ బెద్దగా నేడ్చితిని. ఎచ్చటనుండియో యీ తాతగారరుదెంచి నన్ను రక్షించిరి.

జయ (చంద్రసేనునివంకఁ దేరిపాఱఁజూచి) తండ్రీ! శుపిక్షించి మారురూపుఁబొందియున్న మిమ్ముఁ గుర్తింప నేరని యీజయసేనుని క్షమింపుఁడు (నమస్కరించును)

చంద్ర- (జయసేనుని దగ్గఱకుఁదీసికొని) కుమారా! భ్రాతృద్రోహియు విశ్వాసఘాతకుఁడునగు చండవర్మచే నెట్టి యాపదయు రాకుండ నిన్నుఁగాపాడిన పరమేశ్వరునకు మనమెంతయుఁ గృతజ్ఞులము.

ధర్మ- (సింహాసనమునుండిదిగి) చంద్రసేనమహీపాలా! దిగంతవిశ్రాంతకీర్తివంతులగు మిమ్ములగుర్తింపఁ జాలని మతిహీనుఁడగు నీధర్మపాలుని క్షమింపుఁడు. (నమస్కరించును)

చంద్ర- సర్వసంపదలఁ గోల్పోయి పుత్రవియోగానలమునఁ బడికృశించి మారు రూపునుపొందియున్న నన్నుగుర్తింపఁజాలక పోయినంత నీవు మతిహీనుఁడ వెట్లౌదువు?

ధర్మ- రాజేంద్రా! పెద్దలగు మీతో నొక మనవిఁ జేయుచున్నాను. (ప్రభావతిఁ జూపుచు) ఈమె నాకుమార్తెయగు ప్రభావతి. ఈకన్య యను మీకుమారుఁడగు జయసేనునకిచ్చి పరిణయంబొనర్ప నెంచితిని. మీరు నాపైఁ గరుణించి; యీందులకు సమ్మతింపుఁడని చే లోమోడ్చి ప్రార్థించు చున్నాను.

చంద్ర- రాజా! నీ కోర్కె కేను కాదందునా? అట్లేకానిమ్ము.

ధర్మ- రండు అంతఃపురంబునకుఁబోయి వివాహప్రయత్నమున నుందము.

(అందరు నిష్క్రమింతురు)







# జయసేన విజయము

## పంచమాంకము

ప్రథమరంగము : వివాహమంటపము

(ప్రవేశము, ధర్మపాలుఁడు; చంద్రసేనుఁడు, జయసేనుఁడు, మతిమంతుఁడు పురోహితుఁడు, హేమలత; ప్రభావతి, మల్లిక.)

మల్లిక- చెలీ! ప్రభావతీ! ఇదిగో సంపెంగపూలమాలిక

ప్రభా- (సిగ్గునటించుచు పూలదండఁ దీసికొని, తలిదండ్రులవైపుదృష్టి నిగుడ్చుచు)

హేమ- కుమారీ! ఆలసించెదవేల? ఆపూలదండను జయసేనుని గళమున నలంకరింపుము. (ప్రభావతి యట్లొనర్చును)

చంద్ర- కుమారా! జయసేన; ఈపూలదండ నామెకంఠమున వైచి పాణిగ్రహణ మొనర్పుము. (జయసేనుండట్లుచేయును.)

ధర్మ- జయసేనా! యీప్రభావతికెట్టిలోపంబు రాకుండగారవించుచూ, సత్సంతానమునుగాంచి కులము నభివృద్ధిగావింపుము.

పురో- తథాస్తు. తథాస్తు. ఆయురారోగ్యాభివృద్ధిరస్తు. పుత్రపౌత్రాభివృద్ధిరస్తు. (అక్షతలు వేయును)

హేమ- అమ్మాయీ! ప్రభావతీ! భర్తయే దైవమని భావించి సేవించు చున్నదాను. మఱువకుము. పాతివ్రత్యము నందెంతయో ప్రభావముం గలదు. విద్యావతివి. వివేకవతివి. నీకింతకన్నఁ జెప్పవలసిన దేమున్నది?

జయ- మామా! ధర్మపాలమహీపాలా! అధర్మమార్గానువర్తియగు చండవర్మ పరిపాలన మెన్నఁడంతమొందునా యని మా రాజ్యమందలి ప్రజలెల్లరుఁ దలంచుచున్నారు. ఇట్టితరుణంబున మా తండ్రిగారి కత్యంత మిత్రులగు భూపాలురకు జాబులు వ్రాసి వారి సేనలఁ దెప్పించుకొని చండవర్మను రణరంగమునఁ బడగొట్టి నే సింహాసనము నధిష్ఠింప వలయు. వలయునేని మీ సాయముం గోరెద.

ధర్మ- వత్సా! అట్లయగుంగాక! ప్రయాణసన్నాహము నొనర్చెద రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు)

ద్వితీయరంగము: రణరంగము.

ప్రవేశము చండవర్మ.

చండ- యౌవనగర్వాంధుండయి; జయసేనుఁ డెటనుండియో సేనలం గూర్చుకొని నాపై దండెత్తి వచ్చినాఁడు. (ఒకవైపుఁ జూచి) సెబాస్. జయసేనుని సేనలలో హతశేషులు పాఱిపోవుచున్నారు. (మఱల బాగునఁ జూచి) కాని. కాని. నా సేనలే పఱుగిడు చున్నవి. నేనిందే యుందునేని నా ప్రాణములు దక్కవు.

(పఱుగిడఁ బోవును) తెరలో

చ॥ నిలు నిలు మూఢురాత్మ తగునే రణసీమను వెన్నఁ జూపఁగా
బలమును సాహసంబుఁగల పార్థివసత్త్వము లెన్నఁ దర్పఁగాఁ
దలఁతురె? మోదఁబోయినను దప్పునె మృత్యువు మింటికేగినన్.
జలధినిఁ జొచ్చినన్ విడువనీ పాతకముల్ నిను దుర్మదాంధుఁడా॥

(పైపద్యముఁ జదువుచు, యిరువురు భటులను మఱిమంతుని వెంట నిడుకొని జయసేనుఁడు ప్రవేశము)

జయ- దుర్మదాంధా! ఇంకెందు బోగలవు? నీకీనాఁడెట్లును మృత్యువు తప్పదు.

మతి- నిరపరాధియగు నా తండ్రిఁ జేతులార వధించిన నిన్ను చిత్ర వధగావించినఁ బాపముండునా?

చంద- బాలురనియెంచి సైచినకొలఁదిని మీప్రగల్భములు మితిమీఱు చున్నవే ?

జయ- క్రూరాత్మా! పలుమాటలతో నేమిపని? సమరానుకూల ప్రదేశమునకుఁ బోవుదమురమ్ము.(అందరు నిష్క్రమింతురు)

(మతిమంతుఁడును, జయసేనుఁడును మరల ప్రవేశింతురు)

మతి- మనకష్టపరంపరకెల్ల మూలకందమగు నీ పినతండ్రిఁ గడతేర్చితివి. కావున యిఁకపైని సింహాసన మధిష్ఠింపుము.

జయ- మిత్రమా! నాజనకునితోఁ గలసి మాటాడి పెద్దలు నిశ్చయించిన శుభముహూర్తంబునఁ బట్టాభిషిక్తుండ నయ్యెద. (ఇరువురు నిష్క్రమింతురు)

తృతీయారంగము - పట్టాభిషేకమంటపము.

(ప్రవేశము జయసేనుఁడు, ప్రభావతి, సింహాసనాసీనులై. మతిమంతుఁడు చంద్రసేనుఁడు, పురోహితుఁడు మొదలగువారు)

చంద్ర- (జయసేనుని శిరమునఁ గిరీటముంచి) కుమారా! ప్రజల నెల్లరఁ గన్నబిడ్డలవోలెఁ గాపాడుచు ధర్మంబుఁ దప్పక యీ ప్రభావతియే పట్టమహిషియై దనర రాజ్యపాలనమొనర్పుము.

జయ- తండ్రీ! తమయాజ్ఞానుసారముగ నేఁ బ్రవర్తించెద.

మతి- మిత్రమా! జయసేనా! నీవు రాజ్యపాలనంబొనర్చుచుండ,

తే॥ గీ॥ వినుమునీ కీర్తి యర్కునట్లు వెలయుచుండ
దాని చెంగట పరమహీధవులకీర్తి
చంద్రికలు భానుఁడుదయింపఁ జంద్రకాంతి
పగిది నిస్తేజమై యొప్పుబరగవలదె?

మఱియు-

తే॥ గీ॥ ప్రజల నెల్లర బిడ్డల పగిదిఁ బ్రేమి
సురుల సురలట్ల సతతంబుఁ జూచుకొనుచు
ధర్మమార్గంబుఁ దప్పక ధరణిపాలు
రెల్లమెచ్చంగ రాజ్యంబు నేలుమయ్య!

చంద్ర- మతిమంతుఁడు చెప్పినమాటలను మరువక నాయాజ్ఞనన్యథా వర్తింపక, ధర్మమార్గానువర్తివై, సత్కీర్తిఁ గాంచుము.

జయ- పెద్దల యానతి శిరసా వహించుచున్నాను

పురో- రాజకుమారా! నీవును మీ పూర్వులవలె సత్కీర్తి కాంతఁ జేపట్టెదవుఁగాక! (అక్షతలు వేయును)

సేవకులు, తదితరులు, జయసేనమహారాజుగారికి జై, జై, జై.

పురో- రాజా! ఇఁకఁ గావలసిన దేమున్నది? అయిన నిల్లగుఁగాక!

భరత వాక్యము

సీ॥ అన్నలభాగంబు లపహరింపఁగ గోరు
కూళలు జనియింపకుండ్రుగాక!
చంద్రసేనునిఁబోలు సద్ధర్మవర్తనుల్
జనియించెదరుఁగాక క్ష్మాతలమున
మతిమంతుఁబోలిన మతిమంతు లెందరో
యింటింట పుట్టి వర్ధిల్లుఁగాక!
పరపూరుషులఁ గాంచి భ్రాతలట్లెదలంచు
పద్మాస్య లిలపైనిఁ బ్రబలుఁగాక!
తే॥ గీ॥ ధర్మ మెల్లెడ నాల్గు పాదముల నడచుఁ
గాక! కవుల కెంతయుఁ గీర్తి గలుగుఁగాక!
ఐకమత్యంబుఁ బ్రజలలో నలరుఁగాక!
శ్రీశుఁ డెల్లరఁ గరుణఁ బోషించుఁగాక!

శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము



# ═ సవరణ ═

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 7 | దుర్గరణ్య | దుర్గమారణ్య |
| ,, | 29 | నౌక | నౌకగానౌక |
| 10 | 5 | ఘుఁనుడు | ఘనుఁడు |
| ,, | 10 | ఒకే | ఒక |
| ,, | 14 | మున్న | మున్నె |
| 20 | 5 | నేనే | నే |
| ,, | 16 | నిరోలోచన | నిరాలోచన |
| 22 | 6 | గమ్మ | గిమ్మ పొమ్మ |
| 24 | 21 | వ్రాయఁబడి | వ్రాయఁబడి |
| 25 | 3 | సధించుట | సాధించుట |
| ,, | 11 | జాపః | జాపఁ |
| 33 | 18 | పెండాడుట | పెండ్లాడుట |
| 46 | 21 | శుదిగా | శుద్ధిగా |
| ,, | 22 | పెండాడి | పెండ్లాడి |
| ,, | 25 | సమయముకు | సమయమునకు |

